

# నేర్చుకొనుటకు పసితనం ప్రతిబంధకంకాదు

బూట్లు మేజోళ్లు ఎట్లు తొడుక్కోవలెనో ఈనాడు అతను నేర్చుకుంటున్నాడు. జీవితమును గురించి ఎక్కువగా రోజూ అతను తెలుసుకుంటున్నాడు. పళ్లు, పనుచిగుళ్లు భద్రతపట్ల రోజూ శ్రద్ధవహించవలసిన విషయం కూడ మీరు అతనికి బోధించాలి. అతడు వృద్ధుడైనపుడు అతని పళ్లు అప్పటికీ చెక్కుచెదరకుండా, సహజంగా వుంటవి. మీ వివేకమును అతను సర్వదాస్మరించుకుంటూ, అసహ్యకరమైన దంతక్షయం మరియు నొప్పి, పనుచిగుళ్ల బాధలబారి నుండి అతనిని రక్షించినందుకు మీకు అభివందనాలు అర్పించుతాడు. మీ పిల్లలకు వారెప్పుడో నేర్చుకోదగిన అత్యుత్తమ అలవాట్లను ఈనాడే బోధించండి—ఫోర్‌హన్స్' టూత్‌పేస్టుతో రోజూ పళ్లు, పనుచిగుళ్లను తోముకుంటూ వుండుట. అమెరికా యందలి దంత వైద్యుడు ఆర్. జె. ఫోర్‌హన్స్‌చే నిర్మించబడిన ఫోర్‌హన్స్' టూత్‌పేస్టు ఒక్కటే ఆరోగ్యవంతమైన గట్టి పనుచిగుళ్లు, మెరిసే తెల్లని పళ్లకు తగిన ప్రత్యేక ఓషధి పదార్థములు గలది. ఇప్పుడే ఈ మంచి తీర్మానం చేయండి : జీవితకాలమంతయూ అనుసరించే అలవాటును మీ పిల్లలకు నేడే ప్రారంభించండి... అది రోజూ ఫోర్‌హన్స్' టూత్‌పేస్టును వాడుటయే. ఒక ఉచిత ప్రతి చిన్న రంగుల పుస్తకం "CARE OF THE TEETH AND GUMS" (ఇంగ్లీషులో) కోసం తపాలా ఖర్చుల నిమిత్తం 15 న.పై. తపాలా బిళ్లలను పంపండి : మేనర్స్' డెంటల్ ఎడ్వయిసరీ బ్యూరో, పోస్టు బ్యాగ్ నం. 10031, బొంబాయి-1.

**COUPON**

Please send me a copy of the booklet
"CARE OF THE TEETH AND GUMS"

*Name*.............................................

*Address*.........................................

C. I ...............................................



# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



ఇవి గాక ఫోటో శీర్షికల పోటీ, మరి ఎన్నో ఆకర్షణలు.

సినిమా
తారలు
మెచ్చిన






# రెమి
## పౌడర్

Aykan



# ప్రశ్నోత్తరాలు

1. *యం. వి. సుశీల, భీమడోలు*

ఫిబ్రవరి సంచికలో "సీత వెళ్ళిపోయిన దగ్గర నుండి రాముడు మాంసాహారము, మద్యపానము మానివేశాడని" హనుమంతుడు చెప్పినట్టు వ్రాశారు. ఆదర్శమూర్తి అయిన శ్రీరామచంద్రుడు దురవ్యసనములలో ఒకటిగా చెప్పబడు మద్యపానమునకు అంతకు పూర్వమయిన అలవడియుండినట్లు నమ్మలేము. వాల్మీకి రామాయణము నుండియే పై వాక్యము గ్రహించబడినచో "కొటేషన్" ఇస్తారని ఆశించుచున్నాను.

మీ రడిగిన "కొటేషన్": "న మాంసం రాఘవో భుఙ్క్తే, న చాపి మధు సేవతే" సుందరకాండ, 36 వ సర్గ, 40 శ్లోకం.

2. *యల్. యు. భాస్కరవర్మ, పిట్లలవానిపాలెం*

ఏమండీ, దక్షిణ ధృవ ప్రాంతంలో నున్న వారికి తాము తల క్రిందులుగా నున్నట్టెందు కనిపించదో తెలియజేస్తారా?

భూమి మీద ఎక్కడ ఉండే వారికైనా "కింద" అనేది భూమియొక్క కేంద్రం ఉండే దిక్కు, "పైన" అంటే దానికి సూటిగా ఉండే ఆకాశం. అందుచేత దక్షిణ ధృవం వాళ్ళకుగాని ఉత్తర ధృవం వాళ్ళకుగాని, భూమధ్యరేఖ మీద ఉన్న వారికి గాని తాము "తలకిందులు"గా ఉన్నామనీ, "ఏటవాలుగా" ఉన్నామనీ అనిపించదు.

3. *తనికెళ్ళ వెంకటరమణశాస్త్రి, మృత్యుంజయనగరం*

"రాత్రి చాలా భాగం గడిచింది. రాక్షసబ్రాహ్మణులు వేదాధ్యయనం ప్రారంభించారు" అన్నారు. రాక్షసులలో గూడ బ్రాహ్మణులుంటారా? వారు పగలు గాక రాత్రి గూడ వేదాధ్యయనం చేస్తారా?

వాల్మీకిని ఎలా శంకించటం?

4. *టి. వెంకటేశ్వర్లు, ఒంగోలు*

రాకెట్‌లో ప్రయాణిస్తున్నప్పుడు భూమి మీదకు సంబంధా లెలా ఏర్పడుతవి ? ఆకాశం అంతా శూన్యం కదా ?

ధ్వని తరంగాలకు మాత్రమే వాయువు లాటి వాహకం కావాలి. కాంతితరంగాలూ, రేడియోతరంగాలూ మొదలైన విద్యుదయస్కాంత తరంగాలకు వాహకం అవసరం లేదు. కనుకనే నక్షత్రాల నుంచి కూడా మనకు కాంతి వస్తున్నది. రాకెట్‌లో ప్రయాణించే వారు భూమితో సంబంధం కలిగి ఉండటానికి రేడియో ఉపయోగిస్తారు.

5. *ఎన్. సూర్యనారాయణ శాస్త్రి, అదోని*

మహాభారతము ఇప్పటికి ఎన్ని పర్వములు అయినది ?

ఈ సంచికతో మహాభారత మంతా అయిపోయింది.

6. *కె. చొక్కలింగం పిళ్ళై, వెంకటాపురం*

భూమి, చంద్రుడు మొదలగు గ్రహములన్నియు తొలుత సూర్యుని లోని భాగమేననియు, సూర్యుని నుండి వెలువడి దూరముగా వచ్చిన ఉపగ్రహములనియు చదువుచున్నాము. ఇది సంభవమా ? సూర్యునికి ఆకర్షణశక్తి లేదా ?

ప్రతి ఆకర్షణ శక్తినీ జయించే "పలాయనవేగం" ఒకటి ఉంటుంది. కనుకనే రాకెట్‌లు భూమియొక్క ఆకర్షణశక్తి నుంచి తప్పించుకుని పోతున్నాయి. ఈనాడు కూడా సూర్యుడిలో మహత్తరమైన శక్తిని మనం చూస్తున్నాం. అనేక లక్షల టన్నుల బరువుండే పదార్థం సూర్యుడి పై భాగం నుంచి ఆకాశంలోకి లక్ష మైళ్ళను మించి లేస్తూ ఉంటుంది. గ్రహాలు పుట్టిన నాటికి సూర్యుడింకా పెద్ద గోళంగానూ చైతన్యవంతంగానూ ఉండి ఉండటం అసంభావ్యం కాదు.

7. *గోరంట్ల అనంతపద్మనాభయ్య, ఉరవకొండ*

మామా, ఫిబ్రవరి నెలలో పడమటి దిక్కున రెండు నక్షత్రాలను చూచుచున్నాను. అవి దినదినమునకు దూర మవుతూండడం అగుపిస్తుంది. దానిలోని ఆంతర్యమేమి ?

అవి నక్షత్రాలు కావు, గ్రహాలు. వాటిలో హెచ్చు కాంతి కలది శుక్రుడు, రెండవది గురుడు. ఫిబ్రవరి 27న ఇవి ఒకదానికొకటి చాలా దగ్గిరలో ఉన్నాయి. ఆ తరవాత శుక్రుడు వక్రగమనం కావటం చేత రోజురోజుకూ మరింత పైకి వచ్చింది. గురుడు ఆ రోజు కా రోజు కిందికి దిగిపోయింది.

A6

టినోపాల్ అదనపు తెలుపు వల్ల

# మీ చీరలు మెరుస్తయ్యి




మీరు వుతికే తెల్ల బట్టలకు టినోపాల్ చేర్చితే ఎంత వ్యత్యాసమో చూడండి. ఎంత ప్రకాశమానమైన తెలుపో. ఎంత అద్భుతమైన కాంతియో! చీరలు, షరాయిలు, తలగడ గలేబులు, పిల్లల బట్టలు. టినోపాల్ అదనపు తెలుపువల్ల మీరు వుతికే తెల్ల బట్టలన్నియు మెరుస్తయ్యి

నేడే టినోపాల్ కొనండి—కొత్త 'పిల్ఫర్ ప్రూఫ్ ప్యాక్'లో గలదు! బాల్చీడు బట్టలకు టీ చెంచాలో నాలుగోవంతు మాత్రమే చాలు.

**కొంచెము టినోపాల్ తెల్లని దుస్తులను అన్నిటికన్న తెల్లగా చేయును.**



టినోపాల్ జె. ఆర్. గెయిగి ఎస్. ఎ. బాస్ స్విట్జర్లెండ్ వారి రిజిస్టరు చేయబడిన ట్రేడుమార్కు

భారతదేశంలో తయారు చేయువారు: సుహృద్ గెయిగి లి., వది వాది, బరోడా

సేల్సు ఆఫీస్: ఎక్స్‌ప్రెస్ బిల్డింగ్, చర్చిగేట్, బొంబాయి-1 బి. ఆర్.

Shilpi SGT 146 TEL



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

ఈ సంచికతో మహాభారతం (అట్టమీది బొమ్మ) కథ ముగుస్తున్నది. దీనిని 1952 జులైలో ప్రారంభించాము. "చందమామ" లో రామాయణం ప్రారంభమయేదాకా మహాభారతం "అట్టమీది బొమ్మ" కథగానే నడిచింది. తరవాత "అట్టమీది బొమ్మ" స్థానం రామాయణం తీసుకుని, మహాభారతం "అట్ట చివరి బొమ్మ" కథగా మార్పు చెందింది. వచ్చే సంచిక నుంచి భాగవతంలోని ఉపాఖ్యానాలు "అట్ట చివరి బొమ్మ" కథలుగా వెలువడతాయి.

సంపుటి 34 ఏప్రిల్ 1964 సంచిక 4





# భారత చరిత్ర




మాల్వా

1305లో అలాఉద్దీన్ ఖల్జీ చేత జయించబడిన మాల్వా, తీమూర్ దాడుల సమయంలో స్వతంత్రమయింది (1401). దానికి దిలావర్ ఖాన్ ఘూరీ రాజయాడు. రణకౌతుకుడైన ఇతని కొడుకు అల్ఫ్‌ఖాన్ 1422లో వర్తకుడిలా మారు వేషం వేసుకుని ఆకస్మికంగా ఒరిస్సా రాజుపై పడ్డాడు. ఒరిస్సా రాజు అతనికి 75 ఏనుగులు లంచమిచ్చి పంపేశాడు. ఇతని కొడుకు ఘజ్నీ ఖాన్ అసమర్థుడు కావటంచేత అతని మంత్రి మహ్మూద్‌ఖాన్ రాజ్యం కాజేశాడు (1436 మే). ఈ విధంగా మాల్వా ఖల్జీరాజుల అధీన మయింది.

మహ్మూద్ ఖల్జీ యుద్ధ కుశలుడు. అతను గుజరాతు, ఢిల్లీ, బహ్మనీ, మేవారు రాజులతో యుద్ధాలు చేశాడు. ఈ యుద్ధా లన్నిటిలోకీ వినోదకరమైనది, ఇతను మేవారు రాణాతో చేసిన యుద్ధం. ఉభయపక్షాలూ విజయం ప్రకటించాయి! రాణా చితోడ్‌లో విజయ గోపురం నిర్మిస్తే, మాల్వా సుల్తాను మాండూలో ఏడంతస్తుల విజయ స్తంభం నిర్మించాడు! ఏమైనా మహ్మూద్ ఖల్జీ సమర్థుడు, తన రాజ్యాన్ని నాలుగు పక్కలా విస్తరింపజేశాడు. ఈజిప్టులోని ఖలీఫా ఇతన్ని గుర్తించాడు.

1469 జూన్ 1న ఇతను చనిపోగా, రెండు రోజుల అనంతరం ఇతని పెద్ద కొడుకు ఘియాసుద్దీన్ మాల్వాకు సుల్తానయాడు. ఇతని రెండవ కొడుకు రెండవ మహ్మూద్ 1510లో రాజ్యానికి వచ్చి, రాజపుత్రుడైన మేదినీరాయ్‌ని ప్రధానిగా పెట్టుకున్నాడు. అతని వెనుకగా హిందువులు పెద్ద పదవులలోకి వచ్చారు. తిరిగి 1561-62 దాకా మాల్వా మొగలు సేనాపతుల అధీనం కాలేదు.



A/0

విదేశీ వర్తకపు రేవులు కారణంగా గుజరాతు చాలా సంపన్నమయింది. 1297 లో అలాఉద్దీన్ దానిని జయించి ఢిల్లీ సామ్రాజ్యంలో చేర్చాడు. దానిని పాలించిన సుల్తాను ప్రతినిధులలో జఫర్‌ఖాన్ అనే ముస్లిము మతం పుచ్చుకున్న రాజపుత్రుడు 1401 లో స్వతంత్రం ప్రకటించాడు. 1411 జూనులో గుజరాతుకు రాజైన అహ్మద్ షా అనేవాడు గుజరాతును వాస్తవంగా స్వతంత్రం చేసిన వాడని చెబుతారు. ఇతను 30 ఏళ్ళు పాలించి, గుజరాతు రాజ్యాన్ని విస్తరింప జేశాడు. అహమ్మదాబాదు నగరాన్ని అందంగా నిర్మించాడు. ఇతను 1442 లో మరణించాడు.

అయితే గుజరాతుకు ఖ్యాతి చేకూర్చి, ఆ రాజ్యాన్ని హెచ్చుగా విస్తృత పరచిన వాడు, మహ్మూద్ బేగర్హా అనేవాడు. ఇతను చిన్నతనంలోనే సింహాసనానికి వచ్చి, 53 ఏళ్ళు పాలించాడు. ఇతని శౌర్యపరాక్రమాలనూ, న్యాయబుద్ధినీ అప్పటి చరిత్రకారులు కీర్తించారు. ఇతను అవసానకాలంలో, భారతదేశంలో పోర్చుగీసువారి ప్రభావం పెరగకుండా చేసేందుకు ఈజిప్టు సుల్తానుతో సంబంధాలు పెట్టుకొన యత్నించాడు.



1508 లో బొంబాయికి దక్షిణంగా చౌల్ వద్ద ఈజిప్టు, భారతీయ బలాలు ఏకమై పోర్చుగీసు నౌకాదళాన్ని ఓడించాయి. అయితే 1509 లో పోర్చుగీసువారు దియూ వద్ద ముస్లిము నౌకాబలాన్ని అంతంచేసి, తమ సముద్రవర్తకం సుస్థిరం చేసుకుని, దియూ వద్ద ఒక ఫాక్టరీ కట్టటానికి స్థలం కూడా పుచ్చుకున్నారు.

1511 లో మహ్మూద్ బేగర్హా చనిపోయిన అనంతరం చెప్పుకోదగినవాడు అతని మనమడు బహదుర్. ఇతను మాల్వాను అధీనం చేసుకోవటమేగాక, మేవార్‌తోకూడా యుద్ధం చేసి చితోడ్‌ను ముట్టడించాడు.

అయితే హుమాయూన్ హయాంలో మాల్వాతోబాటు, ఇతని రాజ్యంలో చాలా భాగం పోయింది. 1537 లో పోర్చుగీసువారు ఇతన్ని ద్రోహంగా చంపేశారు. 1572 లో, అక్బరు కాలంలో గుజరాతు తిరిగి మొగలుల పరమయింది.

కాశ్మీరు

కాశ్మీరు హిందూ రాజుల పరిపాలనలో ఉండేది. 1315 లో షామిర్జా అనే వాడు కొలువులో ప్రవేశించి, రాజు చనిపోయిన అనంతరం సింహాసనాన్ని స్వాధీన పరచుకున్నాడు. ఇతను 1349 ప్రాంతంలో పోయాడు. తరువాత 46 ఏళ్ళపాటు ఇతని ముగ్గురు కొడుకులూ, ఒకరి తరువాత ఒకరుగా కాశ్మీరును పాలించారు. ఆఖరు వాడు 1394 లో పోగా అతని కొడుకు సికందర్ రాజయాడు.

1420 జూనులో ఇతని రెండవ కొడుకు తన అన్నను ఓడించి కాశ్మీరు సింహాసనాన్ని జైనుల్ ఆబిదీన్ అనే పేరుతో అధిష్ఠించాడు. ఇతని 50 ఏళ్ళ పరిపాలన చరిత్ర ప్రసిద్ధమైనది. ఇతను దొంగతనాలూ, బందిపోట్లూ అరికట్టాడు; ధరలు అదుపులో ఉంచాడు; ప్రజల పన్నుల భారం తగ్గించాడు; ప్రజా సౌకర్యాలు పెంపొందించాడు; హిందూ పండితులను తన ఆస్థానంలో ఉంచుకున్నాడు; అందరికీ మత స్వాతంత్ర్యం ఇచ్చాడు; మహాభారతాన్నీ, రాజతరంగిణినీ సంస్కృతం నుంచి పర్షియను భాషలోకి అనువదింప జేశాడు.

ఇతను 1470 డిసెంబరులో మరణించిన అనంతరం కాశ్మీరులో పరిపాలన కన్న అరాజకం హెచ్చుగా ఉండింది. 1540 లో హుమాయూన్ బంధువైన మిర్జాహైదర్ కాశ్మీరును జయించాడు. అయితే 1551లో కాశ్మీరు ప్రముఖు లితన్ని గద్దె దించేశారు. చివరకు 1555 లో, అక్బరు హయాంలో కాశ్మీరు ఢిల్లీ సామ్రాజ్యంలో చేరిపోయింది.





# మహాభారతం

యాదవ వినాశం మాట వినగానే తమకు కూడా కాలం తీరిపోతున్నదని ధర్మరాజు అర్జునుడితో అన్నాడు. అందుచేత పాండవులు మహాప్రస్థానానికి సిద్ధపడ్డారు. ధర్మరాజు యుయుత్సుణ్ణి పిలిపించి, అతనికి రాజ్యమిచ్చి, తన రాజ్యానికి పరీక్షిత్తును రాజుగా చేసి, ఇంద్రప్రస్థానికి యాదవ కులోద్ధారకుడైన వజ్రుణ్ణి రాజుగా చేసి, వారిని కనిపెట్టి ఉండమని సుభద్రకు చెప్పాడు. అనంతరం, చనిపోయిన యాదవప్రముఖులకు జలతర్పణాలు వదిలి, మునుల కందరికీ విందు చేసి, సమస్తదానాలూ ఇచ్చి, పరీక్షిత్తును కృపుడికి శిష్యుడుగా ఉంచి, అందరూ వల్కలాలు ధరించి మహాప్రస్థానం బయలుదేరారు.

వారి ప్రయాణం చూసి పౌరులు చాలా దుఃఖించారు. ద్రౌపదీ సహితులై పాండవులు వెళ్ళిపోతుంటే కొందరికి, జూదంలో ఓడి వారు అరణ్యవాసానికి బయలుదేరటం జ్ఞాపకం వచ్చింది. వారిని స్త్రీ పురుషులు చాలా దూరం వెంబడించి, వారి నిశ్చయాన్ని మార్చలేక వెనక్కు తిరిగారు. వారి వెంట ఒక కుక్క మాత్రమే వెళ్ళింది. ఉలూపి గంగా నది ప్రవేశించింది, చిత్రాంగద తన తండ్రి దేశం వెళ్ళిపోయింది.

పాండవులు తూర్పుగా బయలుదేరి ఒకరి వెనుక ఒకరుగా నడిచారు. ముందు ధర్మరాజూ, వెనుక భీముడూ, అర్జునుడూ, నకులుడూ, సహదేవుడూ, సహదేవుడి వెనుక ద్రౌపదీ, ఆమె వెనుక కుక్కా నడిచారు. అర్జునుడు తన వెంట గాండీవాన్నీ, అక్షయ తూణీరాలనూ ఉంచుకున్నాడు. వారలా వెళ్ళివెళ్ళి లౌహిత్యమనే సముద్రాన్ని చేరుకున్నారు. అక్కడ వారి దారికి అడ్డంగా అగ్నిదేవుడు ప్రత్యక్షమై, " ధర్మరాజా, నేను అగ్నిని. మీ తమ్ముడు అర్జునుడు తన

అట్ట చివరి బొమ్మ




గాండీవాన్ని వదిలెయ్యాలి. అది వరుణుడిది. దానితో పని అయిపోయింది గనక తిరిగి వరుణుడికి చెందాలి,'' అన్నాడు. అర్జునుడు తన గాండీవాన్నీ, అక్షయతూణీరాలనూ సముద్రంలో విసిరివేయగానే అగ్ని అంతర్ధానమయాడు.

అప్పుడు పాండవులు దక్షిణంగా తిరిగి లవణసముద్రపు ఉత్తరతీరం వెంట నడిచి, కొంతదూరం నైఋతి దిక్కుగా వెళ్ళి, పడమరకు తిరిగారు. అక్కడ వారికి సముద్ర జలంలో మునిగి ఉన్న ద్వారకానగరం కానవచ్చింది.

అక్కడి నుంచి వారు ఉత్తరంగా నడిచారు, హిమవత్పర్వతాన్ని చూశారు.

దారిలో అకస్మికంగా ద్రౌపది పడిపోయింది. భీముడు తన ముందు నడిచే ధర్మరాజుతో, ''అన్నా, ద్రౌపది పడిపోయింది. ఆమె ఏ దోషం చేత పడిపోయింది?'' అని అడిగాడు.

''ద్రౌపదికి అర్జునుడంటే పక్షపాతం. అందుచేత పడి పోయింది,'' అని ధర్మరాజు అన్నాడు. కాని ఆయన వెనక్కు తిరిగి చూడలేదు.

తరువాత వరుసగా సహదేవుడూ, నకులుడూ, అర్జునుడూ, భీముడూ పడిపోయారు. సహదేవుడు తన కన్న ప్రాజ్ఞుడు లేడనుకునే వాడనీ, నకులుడు తన అందానికి గర్వించే వాడనీ, అర్జునుడు అందరినీ ఒక్క రోజులో చంపేస్తానని ప్రగల్భాలు పలికాడనీ, ఇతర ధనుర్ధరుల పట్ల తేలిక భావం కలిగి ఉండే వాడనీ, భీముడు తిండిపోతూ, బలగర్వితుడూ అనీ ధర్మరాజు చెప్పాడు. చివరకు ఆయనా, కుక్కా మిగిలారు.

అప్పుడు ఇంద్రుడు రథంతో వచ్చి ధర్మరాజును అందులో ఎక్కమని ఆహ్వానించాడు. తన తమ్ములూ, ద్రౌపదీ వస్తేగాని

తాను స్వర్గానికి రానని ధర్మరాజు చెప్పాడు. "వా రక్కడికి ముందుగానే చేరారు. నీవు కూడా రా," అన్నాడు ఇంద్రుడు.

"దేవా, ఈ కుక్క నన్నే నమ్ముకుని నా వెంట వస్తున్నది. దీనిని కూడా స్వర్గానికి తెస్తాను," అని ధర్మరాజు అన్నాడు.

అందుకు ఇంద్రుడు ఒప్పుకో లేదు. ఇద్దరికీ వాగ్వాదం జరిగింది.

అప్పుడు కుక్క రూపంలో ఉన్న యముడు ధర్మరాజును మెచ్చుకుని, "స్వర్గంలో కూడా నీకు సమానులు లేరు. బొందెతోనే స్వర్గానికి వెళ్ళు," అన్నాడు. ధర్మరాజు రథ మెక్కి స్వర్గం చేరు కున్నాడు. అక్కడ ధర్మరాజుకు దుర్యోధనుడు కనిపించాడు గాని, తన తమ్ములూ, అన్న అయిన కర్ణుడూ, శిఖండి ధృష్టద్యుమ్నులూ, అభిమన్యుడూ మొదలైన వారెవరూ కనిపించ లేదు.

"పాపి అయిన ఈ దుర్యోధనుడితో బాటు స్వర్గం నాకు వద్దు. నా తమ్ములూ, ద్రౌపదీ ఉండే చోటికే వెళ్ళుతాను," అంటూ ఆయన వెనక్కు తిరిగాడు.

"స్వర్గానికి వచ్చినా నీకీ పాత అనుబంధాలు పోలేదా? ఇక్కడ వాటిని విడిచి పెట్టి, హాయిగా స్వర్గ సుఖాలు అనుభ




వించు," అని నారదుడు ధర్మరాజుకు సలహా ఇచ్చాడు. కాని తన తమ్ములున్న చోటికే పోతానని ధర్మరాజు పట్టుపట్టాడు.

దేవతలు అలాగే కానిమ్మన్నారు. ఒక దేవదూత ధర్మరాజును నరకం దిక్కుగా తీసుకుపోయాడు. దారి పొడుగునా పాపులున్నారు. సుఖమైన దారి కాదు. చీకటి. రొచ్చుదారి. దారి పొడుగునా ఈగలూ, దోమలూ ముసురుతున్నాయి. ఎక్కడ చూసినా కళేబరాల గుట్టలు. కత్తులు ఆకులుగా గల చెట్లు. అక్కడక్కడా కాలే ఇసుక నేల. ఇనుప రాళ్ళ గుట్టలు.

"ఇంకా ఎంత దూరం వెళ్ళాలి ?" అని ధర్మరాజు దేవదూత నడిగాడు.

"అయ్యా, ఇది మీరు నడవ దగిన దారి కాదు, తిరిగిపోదాం రండి," అని దేవ దూత అన్నాడు.

దుర్గంధంతో ధర్మరాజుకు తల తిరిగి పోతున్నది. ఆయనకు దుఃఖం ముంచు కొచ్చింది. ఇంతలో ఆయనకు ఆర్తనాదాలు వినవచ్చాయి : "బాబూ, రెండు గడియల పాటు ఆగు, వెళ్ళిపోకు. నీవు రావటంచేత ఈ ప్రాంతాల శుభ్రమైన గాలి వీస్తూన్నది. కాస్త సుఖంగా ఉన్నది! మాకు బాధ అంతగా తెలియటం లేదు."

ధర్మరాజు అక్కడే నిలబడి, "మీ రెవరు ?" అని అడిగాడు.

"కర్ణుణ్ణి! భీముణ్ణి! అర్జునుణ్ణి! నకులుణ్ణి! సహదేవుణ్ణి! ద్రౌపదిని!" అని సమాధానాలు వినిపించాయి. వారంతా అలాటి నికృష్టమైన చోట ఉన్నారని తెలిసి ధర్మరాజు నిర్ఘాంతపోయి, "నాకేమైనా పిచ్చి పట్టిందేమో!" అను కున్నాడు. ఆయన దేవదూతతో, "నాయనా, నీవు తిరిగివెళ్ళు. నే నిక్కడే ఉంటానని నిన్ను పంపిన వారితో చెప్పు," అన్నాడు.

రెండు గడియల అనంతరం ఇంద్రాది దేవతలు ధర్మరాజున్న చోటికి వచ్చారు. వెంటనే నరకచిహ్నాలన్నీ మాయమయాయి. కొద్ది పాపం చేసుకున్న వారు ముందు నరక బాధ అనుభవించి తరవాత స్వర్గసుఖా లనుభవిస్తారని దేవతలు ధర్మరాజుకు తెలియ జెప్పి ఆయన్ను ఉత్తమ లోకాలకు ఆహ్వానించారు.

ధర్మరాజు ఆకాశ గంగలో స్నానం చేసి పవిత్రుడై స్వర్గానికి వెళ్ళి, అక్కడ కర్ణుణ్ణీ, తన తమ్ములనూ, ద్రౌపదినీ, ధృతరాష్ట్రుణ్ణీ, భీష్మద్రోణులనూ, పాండురాజు వెంట కుంతీ మాద్రులనూ, విరాట, ద్రుపద, శిఖండి మొదలైన వారినీ చూశాడు.

★ [ సమాప్తం ] ★






## 34

[ గణాచారి ముఠావాళ్ళ బారినుంచి-బయటపడిన కేశవుడూ అతడి మిత్రులకు, రాకాసి లోయలో, జగభోజీ, కింకరుడూ జరిపిన సంభాషణ వినబడింది. వాళ్లకు పులిరాజు కూడా కనిపించింది. లోయ కవతల సైన్యంతో వచ్చి చేరిన బ్రహ్మపురరాజు, తన గురువుతో లోయలోకి ఎలా ప్రవేశించటం అన్న విషయమై సంప్రతిస్తున్నాడు. —తరవాత ]

కొంత చర్చ జరిగిన మీదట బ్రహ్మపుర రాజు, "గురువర్యా! ఈ సరికే జగభోజి మన రాక తెలుసుకుని వుంటే, వాడు అమ్మాయితో సహా లోయ వదిలి పారిపోయే ప్రమాదం వున్నదని నేను భయపడుతున్నాను," అన్నాడు.

రాజగురువు కొంచెం ఆలోచించి, తల పంకిస్తూ, "మహారాజా! మీరు అలాంటి భయాలేమీ పెట్టుకోకండి. మన రాక జగభోజికి తెలియదనుకోవటం పొరపాటు. అడవిలో కల్పకవల్లిని వాడు పట్టుకున్నప్పుడు అన్న మాటలు, ఆమె చెలికత్తెలు స్పష్టంగానే విన్నారు. ఈ రాబోయే అమావాశ్యకు గాని, వాడి దీక్ష నెరవేరదు. అప్పటివరకూ ఎన్ని ప్రమాదాలొచ్చినా, వాడు యీ రాకాసి లోయులోనే వుంటాడు. ఒక వేళ వాడు ఆఖరి నిమిషంలో భయపడి పారిపో దలిచినా, మనం కాపుంచిన, గురు మౌనానందుడూ, కోయ గడేజంగ్ వాడి ప్రయత్నం సాగనివ్వరు," అన్నాడు.




రాజగురువు అన్నట్టే గుడు మౌనానందుడూ, కోయ గడేజంగ్ తమ తమ అనుచరులతో రాకాసిలోయ నుంచి పైకి ఎక్కి పారిపోయేందుకు వీలున్న దారులన్నీ వేయి కళ్ళతో కాపలా కాస్తున్నారు. మౌనానందుడి అనుచరుల్లో ముఖ్యులు బిడాలీ, శ్వానకర్ణీ; కోయ గడేజంగ్ అనుచరుల్లో ముఖ్యుడు, నరమాంస భక్షకుల నాయకుడైన చండమండూకుడు.

బ్రహ్మపుర రాజు వెంట వీరే కాక పెద్ద సేన కూడా వున్నది. అందులో గజాశ్వదళాలు కూడా వున్నవి. కోయగోమాంగ్ తనకు వినబడుతున్నవని చెప్పే గంటల సవ్వడులు ; ఆ గజసైనిక దళాల్లోని, ఏనుగుల మెడలకు వేలాడుతున్న కంచు గంటలు చేసే ధ్వనులు.

రాత్రి గడుస్తున్న కొందికీ, లోయకు కొంచెం ఎగువగా రాళ్ళ మీద కూచునివున్న కేశవుడూ అతడి మిత్రులకు, అన్నివైపుల నుంచీ రకరకాల శబ్దాలు వినబడుతున్నవి. పిండారబోసినట్టుగా వున్న వెన్నెల కాంతిలో వాళ్ళకు, దిగువనున్న లోయ స్పష్టంగా కనబడుతున్నది. జయమల్లు లోయ కేసి కొంచెంసేపు పరీక్షగా చూసి, "కేశవా! ఈ వెన్నెల వెలుగులో యిక్కణ్ణించి మనం లోయలోకి దిగటం ఏమంత కష్టంకాదు. నా ఉద్దేశం, ఆ పులిరాజును సూర్యోదయం లోపలే చంపి, దాని చర్మం వలిచి, నువ్వు ధరించటం మంచిదని. తెల్లవారితే, మన ఉనికి జగభోజికీ, వాడి అనుచరుడికీ తెలిసిపోవచ్చు," అన్నాడు.

"నువ్వన్నట్టు ఆ పని ఎంత త్వరగా ముగించుకుంటే అంత మంచిది. ఈ లోయ చుట్టూ ఎవరో చేరి, మన కంటె ముందుగా లోయలోకి దిగే ప్రయత్నంలో వున్నారని నా అనుమానం. వాళ్ళు శత్రువులో, మిత్రులో మనకు తెలుసుకునే అవకాశం లేదు," అన్నాడు కేశవుడు.





ఆ తరవాత ముగ్గురూ, కోయగోమాంగ్ దగ్గరవున్న విషం పూసిన అంబులను సమానంగా పంచుకుని, ఎగుడు దిగుడుగా వున్న రాళ్ళ మీది నుంచి, అడవి తీగను ఆసరాగా పట్టుకుని, లోయలోకి దిగారు.

లోయ అంతా నిశ్శబ్దంగా వున్నది. ఉండి వుండి ఏదో ఒక మహా వృక్షం మీది నుంచి గండభేరుండపక్షి ఒకటి వికృతంగా అరుస్తున్నది. నల్లని చెట్ల నీడలూ, ఆ నీడల్లో అటూ యిటూ ఎగిరే మిణుగురుపురుగులూ తప్ప, పులిరాజు అక్కడ వున్న సూచనలేమీ వాళ్ళకు కనిపించ లేదు.

"పులిరాజు యీ ప్రాంతాలే ఎక్కడో మన కోసం పొంచి కూచుని వున్నదని, నా నమ్మకం. ఈ రాళ్ళ దగ్గిర వుండటం ప్రమాదం. ఆ కనబడే ఎండిన మోడు చెట్టు కేసి నడవండి," అంటూ జయమల్లు ముందుకు రెండడుగులు వేశాడు.

ఆ క్షణంలోనే ఆ ముగ్గురూ సంభ్రమాశ్చర్యాలతో నిచ్చేష్టులైయ్యారు. చూస్తూండగానే, ఆ వెన్నెల రాత్రి, అంతవరకూ ఎండి మోడుగా వున్న చెట్టు ఫలపుష్పాలతో నిండిపోయింది.

"కేశవా, మనం జయించాం! ఈ రాకాసి లోయలోని ధనరాసులు మనవే. కాలభైరవుడు నిన్నావేశించి నప్పుడు చెప్పిన దొకటి నిజమైంది. ఇక మనకు కావలసింది, ఆ పులిరాజు...."

జయమల్లు మాట ముగించే లోపలే, ఆశ్చర్యంగా ఆ క్షణాన ఫలపుష్పాలతో నిండి పోయిన మోడు చెట్టు వెనక నుంచి, పులి పెద్దగా ఖాండ్రించిన చప్పుడైంది. మరు క్షణాన కేశవుడు విల్లు అటు కేసి ఎక్కుపెట్టాడు. పులి చెట్టు వెనక నుంచి భయంకరంగా మరోసారి అరిచి, పంజా పైకెత్తి, కేశవుడి కేసి లంఘించ బోయింది. కేశవుడు విషబాణాన్ని గురి చూసి, పులిరాజు రెండు కళ్ళ మధ్య తగిలేలా కొట్టాడు.

పులి ఒక్కసారి గోండ్రించి, చాపచుట్టలా పక్కకు పడిపోయింది. కేశవుడూ, జయమల్లూ, గోమాంగ్ పరుగు పరుగున వెళ్ళి దాని కాళ్ళూ నడుమూ పట్టుకుని పైకి లేవనెత్తారు. జయమల్లు చిన్నగొంతుతో, "నిశ్శబ్దంగా సాధ్యమైనంత త్వరగా ఏదైనా గుహలోకి పదండి. జగభోజి మనం పులిరాజును చంపిన సంగతి యిప్పుడే గ్రహిస్తే ప్రమాదం. దీని చర్మం వలిచి, కేశవుడు ధరిస్తే తప్ప, మన దెబ్బ కిక్కడ తిరుగు వుండదు," అన్నాడు.

ఆ ముగ్గురూ చచ్చిన పులిరాజును మోసుకుని, దాపుల నున్న ఒక గుహలోకి చేరేంతలో జగభోజి కంఠం కర్కశంగా వినిపించింది: "ఏమిరా శిష్యా, కింకరా! ఈ పులిరాజు నాకు నిద్రలేకుండా చేస్తున్నాడు! పాపం, ఆ రాకన్నె ఎంతగా బాధపడుతున్నదో! ఎందుకా గాండ్రిపులూ గోండ్రింపులూ?" అని కేకపెట్టాడు.

"అంతా తెల్లవారి తెలుస్తుంది, గురో! ఆ రాజు ఆఖరున పెట్టిన కేక వింటే—అది గాండ్రింపుగానూ లేదు, గోండ్రింపుగానూ లేదు—గొంతులో ప్రాణ మేదో గురగుర మన్నట్టున్నది. మీరు యిక హాయిగా నిద్రపోండి, ఉదయమే, చూసుకుందాం," అన్నాడు కింకరుడు.








గుహలో ప్రవేశించిన కేశవుడూ, జయమల్లూ, గోమాంగ్ కలిసి, క్షణాల మీద పులి రాజు చర్మం వలిచారు. జయమల్లు ఆ చర్మాన్ని కేశవుడికి నడుం దగ్గిర నుంచి తిప్పి, భుజం మీదుగా చుట్టాడు. కోయ గోమాంగ్ కేశవుడి యీ కొత్త వేషం చూసి, ఎక్కడలేని ఉత్సాహంతో, "కేశవా, యిప్పుడు నీ రూపం చూపరుల్లో భయం, భక్తీ కూడా రేకెత్తించేలా వున్నది. ప్రయత్నిస్తే నువ్వు మా కోయజాతి కంతా నాయకుడివి కాగలవు," అన్నాడు.

"అలాంటి ప్రయత్నాలు చేసే తరుణం యింకా రాలేదు." అంటూ జయమల్లు గుహలో నుంచి ఓమారు బయిటికి తొంగి చూసి, "ఇక మనం యిక్కడ సాధించవలసింది ఒకే ఒక కార్యం వున్నది. కాలభైరవుడు చెప్పిన, ఆ పెద్ద రావిచెట్టూ, దాని పాదంలో వున్న పాముపుట్టా యీ లోయలో ఎక్కడున్నదో కనుక్కోవాలి," అన్నాడు.

"ఆ గుర్తుల్ని బట్టి మనం రావిచెట్టును కనుక్కోవచ్చు. అక్కడ వున్న ధనరాసుల్ని తవ్వుకు పోవటం కూడా వెంటనే చేద్దామంటావా?" అని అడిగాడు, కోయ గోమాంగ్ ఉత్సాహంగా.

జయమల్లు అతడి ప్రశ్నకు జవాబు చెప్పకుండా, చెవులు రిక్కించి వినసాగాడు. దూరంగా ఎక్కడో మనుషులు అటుకేసే నడిచి వస్తున్న సవ్వడి అస్పష్టంగా అతడికి వినిపిస్తున్నది.

"ధనం మాట తరవాత. ముందు రాజకుమార్తెను, ఆ జగభోజి బారి నుంచి కాపాడాలి. మనం, ఆమె రాజ్యపౌరులం!" అన్నాడు కేశవుడు ఆవేశంగా.

జయమల్లు, కేశవుణ్ణి సమీపించి భుజం మీద చెయ్యివేసి, "కేశవా! కాస్త గొంతు తగ్గించి మాట్లాడు. ఈ లోయలో జగభోజి, కింకరులతో పాటు మరెవరో కూడా వున్నా



రని నా అనుమానం. జాగ్రత్తగా విను... ఏవైనా, అడుగుల చప్పుడులు..."

జయమల్లు మాట పూర్తి కాకుండానే, అల్లంత దూరం నుంచి పెద్దగా పిలుస్తున్న ఒక గొంతు వినబడింది: "సోదరా, జగభోజీ! నువ్వెక్కడ? నేను యిక్కడికి తిరిగి వచ్చాను. ఈ రాకాసిలోయలో నీ కంఠ ధ్వనీ, పులిరాజు రంకెలూ విని, నా చెవులకు పట్టిన తుప్పు వదిలించు కుందా మనుకున్నాను. కాని మీ రెండు గొంతులూ వినబడవేం?"

ఆ వెంటనే జగభోజి గొంతు పెద్దగా జవాబిచ్చింది: "సోదరా! ఎవరు? బ్రహ్మదండేనా? ఆహాఁ, ఎంత అదృష్టం! ఎన్నాళ్ళకు తిరిగి వచ్చావు!"

కేశవుడూ, జయమల్లూ, కోయగోమాంగ్ ముఖముఖాలు చూసుకున్నారు. వాళ్ళకు బ్రహ్మదండి మాంత్రికుడి గొంతు భయాశ్చర్యాలను కలిగించింది. సమయానికి యీ దుర్మారుడూ యీ లోయ చేరాడన్న మాట! ఇప్పు డేమిటి కర్తవ్యం?

బ్రహ్మదండి మాంత్రికుడు, జగభోజి నివశించే గుహను చేరిన గుర్తుగా, అటువైపు నుంచి, మాటల ధ్వనులు వినబడసాగినై. ఒకటి రెండు నిమిషాలు గడిచిన తరవాత, బ్రహ్మదండి గొంతుస్థాయి కాస్త పెంచి,





"సోదరా! నువ్వు, ఆ బ్రహ్మపుర రాకన్నె కల్పకవల్లిని అపహరించుకుని యిక్కడికి తేవటంలో పెద్ద ప్రమాదాన్ని కొని తెచ్చుకున్నావు. బ్రహ్మపుర, కపిలపుర రాజ్యాల్లో నివశించే, అనాది ఆటవిక జనాలను వెంట బెట్టుకుని, ఆమె తండ్రి మన రాకాసి లోయను చుట్టు ముట్టాడు. నేను, నీ రక్షకుగాను, పులుగురాయుడనే ఒక పక్షి తల వెధవతో కలిసి ఒక రహస్య సొరంగ మార్గాన యిక్కడికి వచ్చాను," అన్నాడు.

"నా క్షేమం గురించి, నువ్వు పడిన ఆదుర్దా చూసి, నాకు చాలా సంతోషం కలుగుతున్నది. మనం యిద్దరం ఎంత లేదన్నా, పాతిక ముప్పై సంవత్సరాలు, యీ లోయలో ఒకే గురువు దగ్గిర మంత్ర శాస్త్రం అభ్యశించాం. సరే, యింతకూ నువ్వెళ్ళిన పని, ఏమయింది?" అని అడిగాడు జగభోజి.

జగభోజి ప్రశ్నకు, బ్రహ్మదండి ఛీత్కారం చేసి, "మనం గురువు గురువు అనుకునే ఆ నీచుడు, చచ్చి ఎక్కడున్నాడో గాని—వాడు మనకు మనసిచ్చి మంత్ర శాస్త్రం బోధించ లేదు. బ్రహ్మపుర రాజ్యం లోని ఒకానొక కొండలో కాలభైరవుణ్ణి ప్రతిష్ఠాపన చేసి, మనకు కావలసిన జాతకుడు, కేశవు డనేవాణ్ణి పట్టుకుని, వాడి చేత యిక్కడ దొరికే ధనరాసుల విషయం చెప్పించే ప్రయత్నం చేశాను. కాని, నా పని పూర్తయే లోపలే, బ్రహ్మపుర రాజగురువు తన మంత్రశక్తితో అక్కడ వున్న అందరి నోళ్ళూ కట్టేశాడు," అన్నాడు.

ఆ తరవాత జగభోజీ, బ్రహ్మదండి మాంత్రికుడూ కలిసి లోయలోకి కొంత దూరం వెళ్ళి, అక్కడ చెట్ల కింద కూచుని వున్న పులుగురాయుణ్ణీ, స్థూలకాయుణ్ణీ, జితశక్తివర్మలను కలుసుకున్నారు. ఆ సమయంలో తూర్పు దిక్కు కొంచెం తెలతెల్లనవుతున్నది.

"ఇక మనం లోయ మధ్యకు పోదాం. ధనరాసులు నిక్షేపమై వున్న రావిచెట్టూ, ఆ పాము పుట్టా ఎక్కడున్నవో, నాకు తెలుసు!" అంటూ జగభోజి ముందుండి దారి తీశాడు.

జగభోజి, బ్రహ్మదండితో కలిసి గుహ విడిచి పోవటం; రాజకుమారికి కింకరుడి కాపలా సంగతీ—అంతా కేశవుడూ అతడి స్నేహితులూ చూశారు. వాళ్ళకు చీకట్లో ఒక గుహ ముందు అటూ యిటూ పచారు చేస్తున్న కింకరుడి ఆకారం కనబడింది.

వాళ్ళు ముగ్గురూ, కింకరుడు కాపలా కాస్తున్న గుహ దగ్గిరకు వెళ్ళేసరికి, కింకరుడు గుహ ముందు బయట ఆగి, గుహలో వున్న కల్పకవల్లి నుద్దేశించి, "హం రాకుమారీ! బ్రహ్మపుర రాజ్యంలోని సరస్సు దగ్గిర చూడగానే, నిన్ను నేను ప్రేమించేశాను. నువ్వు మా గురువు జగభోజిని ఎలా ప్రేమించి వివాహమాడతావో, నాకర్థం కావటం లేదు. అడవిపంది కోరల్లా వున్న వాడి పళ్ళూ, దబ్బనాల్లా పైకి లేచిన వాడి కనుబొమలూ, నెత్తిన చింకికుళాయీ— ఏ కన్య అయినా వాణ్ణి ఎలా ప్రేమిస్తుంది? నన్ను, చూడు! ఈ తలలో వున్న ఈకలు రాజభేరుండానివి! వాటిని సంపాయించేందుకు నేను చేసిన సాహసం..."

కింకరుడు మాట మధ్యలోనే పెద్దగా అరవబోయి, ప్రాణం కడబట్టుతున్న వాడిలా కీచు మన్నాడు. దానికి కారణం, కేశవుడు ఉచ్చు బిగించి విసిరిన అడవితీగ, గురిగా వాడి కంఠానికి పడి బిర్రబిగుసుకుపోవటం.

"కేశవా! వాడు ఊపిరాడక చచ్చేట్టున్నాడు. వాడితో మనకు కొంత పని వున్నది. ఆ ఉచ్చు కాస్త వదులు చెయ్యి," అంటూ జయమల్లు రాళ్ళ చాటు నుంచి ముందు కురికాడు. కేశవుడు, కింకరుడి మెడకు బిగుసుకు పోయిన ఉచ్చును వదులు చేశాడు. —(ముగింపు వచ్చే సంచికలో)






# యజ్ఞభంగం

విసుగు చెందని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే శ్మశానం కేసి మౌనంగా నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నీవు తలపెట్టిన పని నిర్విఘ్నంగా కొనసాగనందుకు విచారించకు. పూర్వకాలపు మహర్షులు చేయించిన మహత్కార్యాలకే విఘ్నాలు కలిగాయి. అందుకు తార్కాణంగా నీకు శ్వేతకేతుడు చేయించిన యజ్ఞం గురించి చెబుతాను, విను," అంటూ ఈ విధంగా చెప్పసాగాడు :

అయోధ్యా నగరాన్ని పరిపాలించిన సూర్యవంశపు రాజులలో శ్వేతకేతు డుండేవాడు. ఆయనకు ఒక్క కుమార్తె మాత్రమే కలిగింది. యజ్ఞం చేసి దేవతలను తృప్తి పరిచి, ఆ విధంగా పుత్రసంతాన ప్రాప్తి కలిగేటట్టు యత్నించమని ఆయన కులగురువైన వసిష్ఠుడు ఆయనకు సలహా

## బేతాళ కథలు



17



ఇచ్చాడు. అందుకు శ్వేతకేతుడు సమ్మతించాడు.

యజ్ఞశాల నిర్మించి, యజ్ఞానికి అవసరమైన సంబారాలన్నీ సిద్ధపరిచి, రాజు యజ్ఞదీక్షలో కూర్చున్నాడు. యజ్ఞం జరిగేటంత కాలమూ యజ్ఞశాలలో ఎలాటి అశౌచమూ ప్రవేశించరాదు. అలా ప్రవేశించినట్టయితే యజ్ఞబంగ మవుతుంది. అందుచేత యజ్ఞం ప్రారంభమైనది మొదలు పూర్తి అయేదాకా యజ్ఞశాలలో ఉండే ఋత్విక్కులూ, అధ్వర్యులూ, ఉద్గాతృలూ, హోతలూ, పురోహితులూ బయటికి వెళ్ళకుండానూ, పైవారెవరూ యజ్ఞశాలలోకి రాకుండానూ గట్టి ఏర్పాట్లు చేశారు. యజ్ఞశాల యొక్క ద్వారం వద్ద అహోరాత్రాలు కాపలావాళ్ళను పెట్టారు. తరువాత, యజ్ఞం నిర్విఘ్నంగా కొనసాగించ వలసినదిగా సకల దేవతలకూ ప్రార్థనలు జరిపి, యజ్ఞం ఆరంభించారు.

యజ్ఞశాలలో ఉన్న ఋత్విక్కులలో ఖండుడనే బ్రాహ్మణుడూ, ఆయన కుమారుడూ ఉన్నారు. యజ్ఞం సగంలో ఉండగా ఖండుడి దాయాది ఒకడికి ఆయువు తీరిపోయింది. అప్పుడు చిత్రగుప్తుడు యమధర్మరాజు వద్దకు వచ్చి, "ఈ మనిషికి ఆయుర్దాయం తీరిపోయింది. మనం ఇప్పుడితని ప్రాణాలను తెచ్చినట్టయితే, శ్వేతకేతువు చేసే యజ్ఞంలో ఒక ఋత్విక్కుగా ఉన్న ఖండుడికి మైల వచ్చి యజ్ఞానికి భంగం కలుగుతుంది. ఇంకొక వారంలో యజ్ఞం పూర్తి అవుతుంది. అంత దాకా ఖండుడి దాయాదిని బతకనిద్దామా?" అని అడిగాడు.

యముడు కొంచెం ఆలోచించి, "మనం యజ్ఞభంగం గురించి ఆలోచించ నవసరం లేదు. మన పని మనం చేసుకుపోదాం," అన్నాడు. చిత్రగుప్తుడు పంపగా యమదూతలు వెళ్ళి, ఖండుడి దాయాది ప్రాణాలను తీసుకుపోయారు.

ఖండుడికీ, ఆయన కొడుక్కూ మైల వచ్చింది. వారు శ్వేతకేతుడి యజ్ఞశాలలో ఉన్నట్టు ఖండుడి భార్యకు తెలుసు. మైలతో ఉన్న తన భర్త ఋత్విక్కుడుగా ఉంటే యజ్ఞానికి భంగం కలుగుతుంది. మైల వార్త చెప్పకపోతే తనకు పాపం చుట్టుకుంటుంది. ఇలా అనుకుని ఖండుడి భార్య యజ్ఞం జరిగే చోటికి మనిషి ద్వారా మైల వార్త పంపింది.

ఈ వార్త తీసుకుపోయిన మనిషి వారి ఊరి గొల్లది. ఆమె యజ్ఞానికి నెయ్యి తీసుకుపోతూ ఉంది. ఆ మనిషి యజ్ఞశాల బయట కాపలా ఉన్న వాడికి నెయ్యి అందించి, "అయ్యా, లోపల ఉన్న ఖండుడనే ఆయననూ, వారబ్బాయినీ ఒకసారి బయటికి పిలుస్తారా? వారితో ఒక మాట చెప్పాలి!" అన్నది.

"లోపలి వారు బయటికి రావటానికి వీల్లేదు. రాజుగారి ఆజ్ఞ," అన్నాడు కాపలావాడు.

"అయితే, వారిద్దరికీ మైల వచ్చిందని కబురు చెయ్యి. వారి దాయాది ఒకాయన చనిపోయాడు," అన్నది గొల్లమనిషి.

కాపలావాడు అదిరిపడి, "అలాటి మాటలిప్పుడు చెప్పావంటే రాజుగారు నీ తల



తీసేస్తారు. పో అవతలికి!" అని ఆమెను గద్దించాడు.

ఇదే సమయంలో యజ్ఞకుండంలో ఏదో నల్లని ఆకారం గల వస్తువు పడింది. అగ్ని చల్లారింది. ఎంత ఆజ్యం పోసినా ప్రయోజనం లేకపోయింది.

"అపచారం! అపచారం!" అని యాజకులు కేకలు పెట్టారు.

"మీ వల్ల ఏదో లోపం జరిగింది," అన్నాడు రాజు.

"మా వల్ల ఏ లోపమూ జరగలేదు. కాని ఏం జరిగిందో నిదానంగా విచారించుదాం," అన్నాడు వసిష్ఠుడు.

శ్రద్ధగా విచారించిన మీదట, కాపలావాడి ద్వారా యజ్ఞ భంగానికి కారణం తెలిసింది. యజ్ఞశాలలో ఉన్న ఋత్విక్కులలో ఖండుడికి మైల వచ్చింది. ఆ వార్త కాపలావాడి దాకా వచ్చింది, కాని లోపలికి రాలేదు.

"నీకు ఈ సంగతి తెలియగానే లోపలికి ఎందుకు కబురు చెయ్యలేదు?" అని వసిష్ఠుడు కాపలావాణ్ణి అడిగాడు.

"బయటి వార్త లేవీ లోపలికి రానివ్వవద్దని మహారాజగారు ఆజ్ఞాపించారు!" అన్నాడు కాపలావాడు.

"అవును. యజ్ఞభంగం కలుగుతుందనినే నలాటి ఉత్తరువు చేశాను. నా యజ్ఞాన్ని దేవతలే భగ్నంచేశారు," అన్నాడు రాజు.

బేతాళు డీ కథ చెప్పి, "రాజా, దేవతలు శ్వేతకేతుడి యజ్ఞాన్ని ఎందుకు భగ్నం చేశారు? ఆయువు తీరిపోయినవాణ్ణి ఒక్క వారం రోజులపాటు బతికి ఉండ నివ్వటం యమధర్మరాజుకు అసాధ్యమా? యజ్ఞానికి భంగం రాకుండా దేవతలను ప్రార్థించటం బొత్తిగా నిరుపయోగమయిం దెందుకు? ఈ సందేహాలకు సమాధానాలు తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "దేవతలను ప్రార్థించటం నిరుపయోగమయేటట్టు చేసుకున్నది రాజే. యజ్ఞాన్ని నిర్విఘ్నంగా పూర్తిచేసే భారాన్ని అచ్చుగా దేవతలకే వదిలి ఉంటే, యజ్ఞం ముగిసేదాకా ఖండుడికి మైల రాకుండా యముడు చేసి ఉండగలవాడే. కాని రాజు యజ్ఞశాలలోకి అశౌచం రాకుండా తన కట్టుదిట్టాలు తాను వేరే చేసుకుని, దేవతల కా బాధ్యత లేకుండా చేశాడు. యజ్ఞ భంగానికి అసలు కారకుడు శ్వేతకేతుడే!" అన్నాడు.

రాజు కీ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై మళ్ళీ చెట్టెక్కాడు. (కల్పితం)






# గ్రహబలం

ఒక ఊళ్ళో ఒక గొప్ప జ్యోతిష్కు డుండే వాడు. ఆయనకు గంగాధరు డనే కొడు కుండే వాడు. చనిపోతూ జ్యోతిష్కుడు గంగాధరుణ్ణి పిలిచి, "నాయనా, నీ భవిష్యత్తు చెబుతాను విను. విని నీ జీవితాన్ని ఎలా దిద్దుకుంటావో దిద్దుకో. జన్మతః దరిద్రుడివి. నీది సంచార జీవితం. దుష్టులకు ఉపకారం చేసి ప్రత్యుపకారం పొందుతావు. కొంత కాలంపాటు చెరసాలలో ఉంటావు. అప్పుడు నీకు ప్రాణ గండ మున్నది. అది తప్పిందా, నీకు ఆ తరవాత రాజయోగం పడుతుంది," అని చెప్పాడు.

గంగాధరుడికి తన తండ్రి జోస్యంలో పూర్తి నమ్మకం ఉన్నది. చెరసాల కోసమూ, గండం కోసమూ ఎదురు చూస్తూ ఉన్న ఊళ్ళో కూర్చోవటం దేనికి? దరిద్రుడికి అన్నీ సొంత ఊళ్ళే. తనది సంచార జీవిత మని తండ్రి చెప్పనే చెప్పాడు. అందుచేత గంగాధరుడు కాశీకి వెళ్ళి, గంగాతీరాన కూర్చుని శివధ్యానం చేస్తూ ముందుకైనా ఇంత పుణ్యం పోగేసుకుందామని నిశ్చయించుకున్నాడు.

అతను కాశీ మార్గం పట్టి చాలాదూరం ప్రయాణించిన మీదట ఒక రోజు మధ్యాన్నం వేళ దాహం వేసింది. దారిలో ఒక బావి కనిపించింది. గంగాధరుడు తన వెంట తెచ్చుకున్న బిందెకు తాడు కట్టి బావిలో వేశాడు. ఆ బిందెను బావిలో ఉన్న ఒక పులి పట్టుకుని, "అయ్యా, నే నిందులో పడి పైకి రాలేకుండా ఉన్నాను. నన్ను పైకి తీశావంటే నీ రుణం ఉంచుకోను," అని వేడుకున్నది.

దాని మాటలు నమ్మి గంగాధరుడు ఆ పులిని పైకి చేదాడు. అది గంగాధరుడి చుట్టూ ప్రదక్షిణం చేసి, "అయ్యా, నేనొక మనిషిని తరుముతూ వచ్చాను. ఇద్దరమూ

ఆర్. కేశవరావు




ఈ బావిలో పడ్డాం. ఆ మనిషి కూడా బావిలో ఎక్కడో ఉన్నాడు. అలాగే ఒక ఎలుకను పాము తరుముతూ వచ్చింది. అవి కూడా బావిలో ఉన్నాయి. తీస్తే ఆ రెంటినీ పైకి తియ్యి గాని, ఆ మనిషిని మాత్రం తియ్యి వద్దు. వాడు దుష్టుడు. నీవు నాకు సహాయం చేశావు గనక నీవు తలుచుకున్నప్పుడు వచ్చి నీకు సహాయం చేస్తాను," అని చెప్పి వెళ్ళిపోయింది.

గంగాధరుడు మళ్ళీ బిందె బావిలోకి దించాడు. ఈసారి, బావిలో ఉన్న పాము తనను పైకి తీయమని ప్రార్థించింది. గంగాధరుడు పైకి తీసిన మీదట పాము కూడా అతనికి ప్రదక్షిణం చేసి, తనను తలుచుకున్నప్పుడు వచ్చి సహాయం చేస్తానని చెప్పి, తన దారిన తాను వెళ్ళిపోయింది.

గంగాధరుడు మూడోసారి చేద వేసినప్పుడు ఎలుక ప్రార్థించింది. దాన్నికూడా అతను పైకి తీశాడు. నాలుగోసారి బావిలో ఉండే మనిషి, తనను కూడా పైకి తీయమని గంగాధరుణ్ణి వేడుకున్నాడు. అతన్ని తీయవద్దని పులి సలహా ఇచ్చినప్పటికీ గంగాధరుడు అతన్ని కూడా పైకి తీసి, నీరు చేదుకుని తన దాహం తీర్చుకున్నాడు.

తరువాత బావిలో నుంచి పైకి వచ్చిన మనిషి గంగాధరుణ్ణి, "అయ్యా, నా పేరు మాణిక్యవర్మ. నే నొక నగల వ్యాపారిని. మాది ఉజ్జయిని. ఆ మృగాలు తమతో అన్న మాటలు విన్నాను. ఆ మాటలను మీరు నమ్మవద్దు. తమరు మా యింటికి వచ్చి నా ఆతిథ్యం స్వీకరించి వెళ్ళండి," అని కోరాడు.

ఈ మాటలు విని గంగాధరుడు సంతోషించి, "ఇప్పుడు నేను కాశీ వెళ్ళుతున్నాను. మరెప్పుడైనా అవకాశం దొరికినప్పుడు మీ యింటికి వస్తాను," అని చెప్పి, మాణిక్యవర్మ దగ్గిర సెలవు పుచ్చుకుని తిన్నగా కాశీకి వెళ్ళిపోయాడు.

అక్కడ అతను పదేళ్ళుండి శివార్చన చేశాక స్వదేశం పైన బుద్ధి మళ్ళింది. అతను తన గ్రామానికి తిరిగి వస్తూ బావి దగ్గిరికి వచ్చేసరికి, అతనికి పులీ, పామూ, ఎలుకా జ్ఞాపకం వచ్చాయి. పులి చెప్పిన మాట ఎంతవరకు నిజమో తెలుసుకుందామని దాన్ని తలుచుకున్నాడు. వెంటనే పులి, తన నోట ఒక కిరీటం కరచుకుని అక్కడికి వచ్చింది. అది ఆ కిరీటాన్ని గంగాధరుడి కిచ్చి, "నా వల్ల ఏమైనా సహాయం కావాలా?" అని అడిగింది.

"ఏమీ లేదు. ఊరికే ఒక్కసారి చూద్దా మనుకున్నాను," అన్నాడు గంగాధరుడు.

అదేవిధంగా అతను పామునూ, ఎలుకనూ కూడా తలుచుకున్నాడు. అవి కూడా వచ్చాయి. పాము అతనికి సర్పదష్టులై చనిపోయిన వారిని బతికించే శక్తినిచ్చింది. తరువాత ఆ రెండూ వెళ్ళిపోయాయి.

గంగాధరుడికి మాణిక్యవర్మను కూడా చూడా లనిపించింది. అతని ఆతిథ్యం స్వీకరించటమే గాక, పులి తనకు కానుకగా ఇచ్చిన కిరీటాన్ని అతనికి విక్రయించి రొక్కం పుచ్చుకోవచ్చునని అతనికి తోచింది. అతను కిరీటాన్ని తన పై బట్టలో చుట్టి పెట్టుకుని, ఉజ్జయినిలో ఉన్న మాణిక్యవర్మ ఇంటికి బయలుదేరి వెళ్ళాడు.





మాణిక్యవర్మ గంగాధరుడికి మన స్ఫూర్తిగా స్వాగతం చెప్పి, గొప్పగా అతిథి సత్కారం చేశాడు.

గంగాధరుడు తాను తెచ్చిన కిరీటాన్ని చూపగానే మాణిక్యవర్మకు రాజాదరణ పొందే మార్గం తట్టింది.

కొద్ది రోజుల క్రితం ఆ దేశపు రాజుగారు వేటకు వెళ్ళాడు. ఆయన తిరిగి రాలేదు. ఆయన కోసం వెతకగా ఆయన దుస్తులూ, రక్తమూ, కొద్ది శరీర భాగాలూ మాత్రమే కనిపించాయి. రాజుగారు దుర్మరణం పాలయాడు. ఆయన కొడుకు రాజ్యాభిషేకం చేసుకుని రాజయాడు.

ఇప్పుడు గంగాధరుడు తెచ్చిన కిరీటం దుర్మరణం పొందిన రాజుది. దీనిని తీసుకు పోయి కొత్త రాజుకు చూపి, అది తెచ్చిన వాణ్ణి పట్టి యిస్తే తనకు శాశ్వతంగా రాజాదరణ దొరుకుతుందని మాణిక్యవర్మ గ్రహించాడు. అతను గంగాధరుడితో, "మీరు తొందరపడక రెండు రోజులు నాకు వ్యవధి ఇచ్చినట్టయితే నేను మీకు దీని పూర్తి మూల్యం ముట్టేటట్టు చూడగలను," అన్నాడు. గంగాధరుడు సమ్మతించాడు.

మర్నాడు గంగాధరుడు స్నానానికి నదికి వెళ్ళగానే మాణిక్యవర్మ కిరీటాన్ని తీసుకుని రాజు వద్దకు వెళ్ళి, "మహారాజా, పెద్ద రాజుగారిని హత్య చేసిన మనిషిని కని పెట్టాను. అత నిప్పుడు మా యింటనే ఉన్నాడు. అతని వద్ద ఈ కిరీటం ఉన్నది. చిత్తగించండి!" అంటూ కిరీటం చూపాడు.

నిజానికి పెద్ద రాజును చంపినది పులి. కాని రాజుకు పులి మాట తెలియదు. గంగాధరుడే తన తండ్రిని చంపా డనుకుని, విచారణ కూడా జరపకుండా, అతన్ని చీకటి కొట్టులోకి తోయించమనీ, అన్న పానాలు లేక మాడి చావనిమ్మనీ ఉత్తరువు చేసి, మాణిక్యవర్మకు మంచి బహుమతి ఇచ్చి పంపేశాడు.

రాజభటులు మాణిక్యవర్మ ఇంటికి వచ్చి, గంగాధరుణ్ణి పట్టుకుని తీసుకుపోయి చీకటి కొట్టులో వేసేశారు.

రాజభటులు తనను చీకటి కొట్టులో ఎందుకుంచినదీ గంగాధరుడికి తెలియలేదు. కాని మాణిక్యవర్మ చేసిన మోసం చేతనే తన కీ గతి పట్టిందని అతను అనుకున్నాడు. ఈ స్థితిలో తనకు సహాయం చెయ్యగల వారెవరున్నారు—పులీ, పామూ, ఎలుకా తప్ప? అందుకని గంగాధరుడు వాటిని తలుచుకున్నాడు.

పులి నగరం వెలుపలి దాకా వచ్చింది గాని చెరసాలదాకా రాలేకపోయింది. పామూ, ఎలుకా మటుకు అతనున్న చోటికి రాగలిగాయి. అవి గంగాధరుడికి ప్రాణాపాయం లేకుండా కాపాడుతామని మాట ఇచ్చాయి.

తరువాత పామూ, పులీ కూడబలుక్కుని, రాజుకు తగిన విధంగా బుద్ధి చెప్ప నిశ్చయించుకున్నాయి. అది మొదలు ఆ రాజ్యంలో పులుల భయమూ, పాముల భయమూ అపారంగా హెచ్చిపోయింది.

ఈ లోపుగా కొన్ని వేల ఎలుకలు గంగాధరుడుండే చీకటి కొట్టులోకి సొరంగం తవ్వి, దానికుండా అతనికి కావలిసిన ఆహారమంతా చేరవేస్తూ వచ్చాయి. ఆ ఆహారం తిని గంగాధరుడు సుఖంగా జీవించాడు.



కాలం గడిచిన కొద్దీ దేశంలో పాముకాటు చావులూ, పులుల వల్ల పశువుల నష్టమూ హెచ్చు మీరిపోయాయి. ఈ పీడలను రాజు గారు ఏవిధంగానూ అరికట్ట లేక పోయాడు. ఒకనాడు రాజుగారి చెల్లెలు రత్నమంజరి పాము కరిచి చనిపోయింది. ఆమెను బతి కించిన వాడికి అర్థ రాజ్య మిస్తాననీ, రత్న మంజరి నిచ్చి పెళ్ళి చేస్తాననీ రాజు చాటింపు వేయించాడు.

"రత్నమంజరిని నేను బతికిస్తాను!" అని చీకటి కొట్టులో నుంచి గంగాధరుడు కేకలు పెట్టాడు. ఆ కొట్టులో ఉండే మనిషి ఏనాడో చచ్చిపోయి ఉంటా డనుకుంటున్న కాపలా వాళ్ళు రాజుగారి వద్దకు పోయి, "మహారాజా, పెద్ద రాజు గారి ని చంపి చీకటికొట్టులో పడిన మనిషి ఇంకా బతికే ఉన్నాడు. తాను పాము కాటుతో చచ్చి పోయిన వారిని బతికిస్తానని కేకలు పెడు తున్నాడు," అని చెప్పారు.

ఇంతకాలం ఆహారం లేకుండా బతికి ఉండిన మనిషిలో ఎంత మహత్తయినా ఉండవచ్చు ననుకుని రాజుగారు గంగా ధరుణ్ణి తన వద్దకు తీసుకు రమ్మన్నాడు.

గంగాధరుడు వచ్చి రత్నమంజరిని చేతితో నిమురగానే ఆమె లేచి కూర్చున్నది. అప్పుడు గంగాధరుడు జరిగినదంతా రాజుతో చెప్పి, ఎలుకలు తనకు తిండి పెట్టి కాపాడినట్టు గానే, పులీ, పామూ తన నిమిత్తమై రాజ్యంలో సంక్షోభం కలిగించి ఉంటాయనీ, తనకు విడుదల అయినాక వాటి భయం ఉండదనీ అన్నాడు.

ఆ విధంగానే దేశంలో పులుల భయమూ, పాముల భయమూ సమసిపోయింది. రాజు గారు గంగాధరుడికి తన చెల్లెలి నిచ్చి పెళ్ళి చేయటమే కాక, అన్న ప్రకారం అర్ధ రాజ్యం కూడా అతడికి ఇచ్చాడు. దానితో గంగాధరుడికి తండ్రి చెప్పిన జోస్యం పూర్తిగా నిజమయింది.





# ముష్టి చెంబు

ఒక ఊళ్ళో సాంబు డనే వాడుండే వాడు. సాంబుడి తండ్రి బాగా బతికిన వాడే గాని, తాను బతికినన్నాళ్ళూ ఎడాపెడా అప్పులు చేసి, చచ్చిపోతూ సాంబుడి మెడకు ఆస్తిని మించిన అప్పు అంటగట్టి పోయాడు. చిల్లర బాకీల కింద గొడ్డూ గోదా ఇచ్చేసి, తన ఇంటిని గృహపరికరాలతో సహా తమ పెద్ద బాకీదారైన షావుకారు పరంచేసి, సాంబుడు తమ ఇంటి పక్కనే ఉన్న ఖాళీస్థలంలో చిన్న పూరి గుడిసె వేసుకుని, అందులోకి తన భార్యా బిడ్డలతో ప్రవేశించాడు.

తన తండ్రి ఆస్తిలో సాంబుడు ఒక్క వెండి చెంబును మాత్రం బాకీదార్ల వాత పడకుండా కాపాడుకో గలిగాడు. అది సాంబుడి తాతది. ఆ వెండి చెంబుతో సాంబుడి తాత ముష్టి యెత్తి, ఆ విధంగా డబ్బు పోగుచేసి ఆస్తిపరుడైనాడట. ఈ మాట సాంబుడికి అతని తండ్రి చెప్పాడు.

ఇప్పుడు సాంబుడికి ముష్టి యెత్తి తన సంసారం గడుపుకోవటం తప్ప గత్యంతరం లేదు. అందుచేత తాతగారి ముష్టి చెంబునే తానూ ఉపయోగింతా మనుకున్నాడు. కాని వెండి చెంబు పట్టుకుని ముష్టికి బయలు దేరితే అందరూ ఆక్షేపించవచ్చు. అందు చేత సాంబుడు తాతగారి ముష్టి చెంబుకు గుడ్డ చుట్టి ముష్టికి బయలుదేరాడు.

ఆ చెంబులో ఏమి మహత్తున్నదో గాని క్షణంలో చెంబు నిండింది. మధ్యాన్నం లోపల సాంబుడు అర మూట బియ్యం ఇంటికి చేర్చాడు.

రోజూ ఇలాగే జరుగుతూ వచ్చింది. ఇప్పుడు సాంబుడి కుటుంబానికి ఏ లోటూ లేదు. తాము తినగా మిగిలిన బియ్యం అమ్మి పై ఖర్చులు గడుపుకుంటున్నారు.

ఇదంతా చూసి, సాంబుడి ఇల్లు ఆక్ర మించుకుని అందులో కాపరం ఉంటున్న

కె. రామలింగయ్య



షావుకారుకూ, భార్యకూ ఆశ్చర్యమయింది. వాళ్ళు తమ పిల్లల్ని చారులుగా ఉపయోగించి, సాంబుడి గుడిసెలో జరిగేదంతా ఆరా తీయించారు. సాంబుడి ముష్టి చెంబు వెండి చెంబని షావుకారు పిల్లలు కనిపెట్టి, తమ తల్లిదండ్రులతో చెప్పారు.

ఈ సంగతి తెలిసి షావుకారు భార్యకు చాలా కోపం వచ్చింది. ఆమె తన భర్తతో, "ఆ వెండి చెంబు మనకు చెందవలిసినది. మన బాకీ కింద ఆస్తి అంతా ఇచ్చేసి. వెండి చెంబు దాచుకున్నాడంటే అది దొంగతనం కాక మరేమిటి? మీరు వెళ్ళి ఆ చెంబు అడిగి పుచ్చేసుకోండి. కాకపోయినా, వీధుల వెంట ముష్టెత్తటానికి వెండి చెంబేమిటి? ఎంత విడ్డూరం!" అన్నది.

"బాకీ పరిష్కారమైన తరవాత ఇప్పుడేం చెయ్యగలం?" అన్నాడు షావుకారు.

"ఆ చెంబు తనదని ఒప్పుకుంటాడా, అది మన సొత్తే. తనది కాదంటాడా, ఎక్కడో దొంగిలించా డన్నమాట!" అన్నది భార్య.

"సాంబుడు దొంగ అని రుజువు చేస్తే మనకేం ఒరుగుతుంది?" అన్నాడు షావుకారు విసుగ్గా.

"దొంగతనానికి దొంగతనమే విరుగుడు!" అన్నది షావుకారు భార్య.

ఆ రాత్రి ఆమె తన కొడుకును పంపించి సాంబుడి ముష్టి చెంబు దొంగతనం చేయించి తెప్పించింది. సాంబుడి గుడిసెకు తలుపులూ, ద్వారబంధాలూ లేకపోవటం చేత దొంగతనం సులువుగానే జరిగిపోయింది.

షావుకారూ, భార్యా చెంబును పరీక్ష చేశారు. నిక్షేపంలాటి వెండి చెంబు!

"ఇది తనదని ఆ సాంబుణ్ణి వెళ్ళి ఫిర్యాదు చేసుకోమనండి!" అన్నది, షావుకారు భార్య. ఆమె ఆ చెంబును తన పక్కలోనే పెట్టుకుని నిద్రపోయింది.

ఆమె తెల్లవారి లేస్తూనే ముష్టి చెంబు చేత్తో తీసుకుని, ఇల్లంతా కలయ జూసి

ఆశ్చర్యపడింది. ఆమె అదుర్దాగా భర్తను లేపి, "ఏమండీ, త్వరగా చెంబు తీసుకుని ముష్టికి బయలుదేరండి! వేళ మించి పోతున్నది! ఈ ఇల్లు చూశారా? ఇది మన ఇల్లు కాదు! ఎవరింటోకో వచ్చాం. ఎలా వచ్చామో, ఏమిటో?" అని అడావుడి చేసింది.

షావుకారు ముష్టి చెంబు చేత బట్టుకుని ఇల్లంతా కలయ జూస్తూ, "అవునే! మనం ఈ ఇంట్లో ఎందుకున్నాం? ఇల్లు గల వారు చూస్తే ఏమనుకుంటారు? పిల్లలను తీసు కుని బయటి అరుగు మీద కూర్చో. నేను నాలుగిళ్ళూ తిరిగి వస్తాను," అంటూ బిచ్చానికి బయలుదేరాడు

షావుకారు వెండి చెంబు తీసుకుని ఇంటింటికీ ముష్టికి వస్తున్నాడన్న వార్త ఊరంతా పాకింది. ఊళ్ళో జనం గుంపులు గుంపులుగా ఆయన చుట్టూ గుమిగూడి, "షావుకారుగారూ, ఇదేం పని? మీకు బిచ్చ మెత్తే ఖర్మేం?" అని అడిగారు.

షావుకారు దరిద్రదేవత పూనినవాడిలాగా, "నాకీ చెంబు తప్ప వేరే ఆధార మేమున్నది? ముష్టెత్తక పోతే నా భార్యనూ, బిడ్డలనూ ఎలా పోషించగలను? వాళ్ళు మాడే కడుపులతో, ఎవరి ఇంటి అరుగుల మీదనో పడి ఉన్నారు. దయ ఉంచి నలుగురూ నాలుగు గుప్పిళ్ళు వెయ్యండి!" అన్నాడు.



షావుకారుకు మతి పోయిందని కొంద రనుకున్నారు. మరి కొందరు షావుకారింటికి వెళ్ళి, ఆయన భార్యా బిడ్డలు బయటి అరు గుల మీద దీనంగా కూర్చుని ఉండటం చూశారు. "నీ భర్త ఎక్కడ?" అని షావు కారు భార్య నడిగితే, "బిచ్చమెత్తటానికి వెళ్ళారు. ఆయన రావాలి, మాకింత కూడు దొరకాలి!" అన్నది.

ఈ వింత ఏమిటో తెలియక ఊరివాళ్ళు తికమక పడుతుండగా సాంబుడు వచ్చి అసలు సంగతి బయట పెట్టేశాడు. అతను రోజులాగే ఉదయానే లేచి బిచ్చ మెత్తటాని కని ముష్టి చెంబు కోసం వెతికాడు. కాని, ఎంత వెతికినా అది కనిపించలేదు. ఇంతలో, షావుకారు ఇల్లిల్లూ తిరిగి బిచ్చ మెత్తుతున్నా డనీ, ఆయన చేతిలో వెండి చెంబున్నదనీ అతనికి తెలిసింది. అతను షావుకారున్న చోటికి పరిగెత్తుకుంటూ వచ్చి, అక్కడ చేరిన జనంతో, "అదే నా ముష్టి చెంబు. అది షావుకారు చేతిలోకి ఎలా వచ్చిందో తెలియటం లేదు. రాత్రి మేము పడుకునే టప్పుడు కూడా మా ఇంట్లో ఉన్నది. తెల్ల వారి లేచి చూస్తే లేదు," అన్నాడు.

ఏమి జరిగి ఉంటుందో అందరూ సులు వుగా గ్రహించారు. షావుకారు పరమ లోభి. సాంబుడి ముష్టి చెంబు వెండి దని తెలిసి దొంగతనం చేసి ఉంటాడు. చేసిన పాడు పనికి మంచి ప్రాయశ్చిత్తం జరిగిందని అందరూ సంతోషించారు. నలుగురూ ఆయన చేతిలో ఉన్న ముష్టి చెంబు లాగేసి సాంబుడి కిప్పించారు.

వెంటనే ఆత్మజ్ఞానం కలిగి షావుకారు పదిమందిలోనూ తీరని అవమానం పొందాడు. ఆయన ఆ రాత్రే తన డబ్బూ దస్కమూ తీసుకుని పెళ్ళాం పిల్లలతో సహా మరొక గ్రామానికి వెళ్ళిపోయాడు. ఊరి వాళ్ళు సాంబుణ్ణి తిరిగి అతని ఇంట గృహ ప్రవేశం చేయించారు.





# సాలెవాడి చాతుర్యం

ఒకనాడు ఒక రాజుగారు సింహాసనం మీద కూర్చుని ఉండగా పొరుగు దేశపు రాజు వద్ద నుంచి ఒక దూత వచ్చి, రాజుగారి సింహాసనం చుట్టూ సుద్ద ముక్కతో ఒక వలయం గీసి, మాటా పలుకూ లేకుండా నిలబడ్డాడు.

రాజు తన మంత్రులను పిలిచి, "వీడి ఉద్దేశం ఏమై ఉంటుంది?" అని అడిగాడు.

మంత్రులు ఏమీ చెప్పలేక తెల్ల మొహాలు వేశారు. రాజు మండి పడి, "దీనికి అర్థం చెప్ప గల చతురుణ్ణి వెతికి తీసుకు రండి," అని ఆజ్ఞాపించాడు.

మంత్రులు బెదిరిన కాకుల్లాగా అన్ని వైపులకూ వెళ్ళి గాలించారు. వారిలో కొందరు ఒక ఇంటికి వచ్చారు. ఇంటి లోపల ఒక గదిలో ఉయ్యాల ఒకటి దానంతట అదే ఊగుతున్నది. డాబా మీద ధాన్యం ఆరబోసి ఉన్నది. దానిని తినటానికి పక్షులు వేచి ఉన్నాయి, కాని ఎగువన ఉన్న పంఖా ఆడుతూ ఉండటం చేత అవి ధాన్యాన్ని సమీపించ లేకుండా ఉన్నాయి.

మంత్రులు మరొక గది ప్రవేశించి అక్కడ మగ్గం నేస్తున్న సాలెవాణ్ణి చూశారు.

"నీ ఇంట్లో ఈ విడ్డూరా లేమిటి? ఉయ్యాల దాని కదే ఊగుతున్నది, పంఖా దాని కదే ఆడుతున్నది!" అన్నారు వాళ్ళు.

"వాటిని నేనే ఆడిస్తున్నాను. మగ్గం నుంచి ఉయ్యాల కొక తాడూ, పంఖా కొక తాడూ కట్టి ఉన్నాయి," అన్నాడు సాలెవాడు.

"అద్భుతం! అద్భుతం! నీవే మాకు కావలిసిన చతురుడివి. మా కొక సమస్య వచ్చింది, దాన్ని విప్ప గలవా?" అని మంత్రు లడిగారు.

"ఏమిటా సమస్య?" అని సాలెవాడు అడిగాడు. మంత్రులు చెప్పారు.

హెచ్. వీరేశలింగం

సాలెవాడు కొంచెంసేపు ఆలోచించి, "ఇది నేను వస్తే తప్ప తేలే విషయం కాదు," అంటూ రెండు గోలికాయలు తీసుకుని వారి వెంట బయలుదేరి రాజుగారి వద్దకు వెళ్ళాడు.

సాలెవాడు రాజుగారికి దణ్ణం పెట్టి, వలయాన్ని గమనించి, దూత కేసి ఒకసారి చూసి, తాను తెచ్చిన గోలీలను వాడి ముందు పడేశాడు.

వెంటనే దూత తన జేబు నుంచి గుప్పెడు జొన్నలు తీసి కింద పోశాడు.

సాలెవాడు చిరునవ్వు నవ్వుతూ, అవతలికి వెళ్ళి ఒక కోడిని తీసుకు వచ్చి జొన్న గింజల మీదికి వదిలాడు.

ఆ కోడి గింజలన్నిటినీ, ఒక్కటి మిగల్చకుండా తిన్నది. అది చూసి దూత అతి వేగంగా నిష్క్రమించాడు.

"ఇదంతా ఏమిటో నాకు కొంచెం కూడా బోధపడలేదు," అన్నాడు రాజు.

"మరేమీ లేదు, మహారాజా. అవతలి రాజు మనని ముట్టడిస్తానని కబురు చేశాడు. మనం ఓటమి ఒప్పుకుంటామో, యుద్ధానికి సిద్ధమో తెలుసుకుందామని దూత వేచి ఉన్నాడు. "మీరు గోలీలాడుకునే పిల్ల వెధవలు," అని నేను సమాధానం చెప్పాను. "మాకు చాలా సేన ఉన్నది," అని చెప్పటానికి వాడు జొన్నలు విద జల్లాడు. ఒక్కణ్ణి కూడా మిగల్చమని కోడి ద్వారా నేను మళ్ళీ జవాబు చెప్పాను. ఆ సందేశం పట్టుకుని వాడు వెళ్ళిపోయాడు," అని సాలెవాడు వివరించాడు.

"భేష్! భేష్! నీవే నిజమైన తెలివి గల వాడివి! ఇక్కడ ఉండి పో. నిన్ను నా ప్రధాన మంత్రిని చేస్తాను," అన్నాడు రాజు సంతోషంగా.

"ఇంకా నయం! నా కవతల బోలెడంత పని ఉన్నది," అంటూ సాలెవాడు వెళ్ళిపోయాడు.





# సంగీత విద్వాంసుడు

ఒకప్పుడు కూర్మద్వీపం కళలకు పెట్టినది పేరు. అక్కడ ఎవరిని కదిలించినా సంగీత, సాహిత్య, నృత్య గానాది విద్యలలో ప్రవేశమూ, ఆసక్తి కలవారే. ఆ ద్వీపంలో శర్వకుడనే ఒక యువకు డుండేవాడు. అతను నృత్య గాన కళలలో గొప్ప పాండిత్యం గలవాడు. అయితే అప్పటికే పేరు మోసిన విద్వాంసు లెందరో ఆస్థానంలో ఉండటం చేత శర్వకుడికి రాజాదరణ లభించే అవకాశం లేకపోయింది. అతను కొంత కీర్తి, ధనమూ సంపాదించి, పెళ్ళి చేసుకుని ఒక ఇంటి వాడవుదా మనుకుంటే అందుకు తగిన అవకాశం కనిపించలేదు.

శర్వకుడికి తెలిసిన మిత్రు డొకడు ద్వీపాంతరాలలో వర్తకం చేస్తూ ఉండేవాడు. మరాళద్వీపానికి వెళ్ళితే అక్కడ శర్వకుడికి మంచి సన్మానం జరగవచ్చునని, అక్కడి ప్రజలు కళలలో చాలా వెనుక పడి ఉన్నారనీ, రాజు ఏ కళాకారుడు వచ్చినా ఆదరిస్తున్నాడనీ సలహా ఇచ్చాడు. సలహా ఇవ్వటమే కాదు, మరాళద్వీపం మీదుగా వెళుతున్న వర్తకనౌకలో శర్వకుణ్ణి ఎక్కించుకుని వెళ్ళాడు.

తన వీణతో సహా శర్వకుడు మరాళ ద్వీపంలో దిగి తాను సంగీత విద్వాంసుణ్ణని తెలియజేయగానే క్షణంలో ఆ వార్త రాజుగారి దివాణానికి చేరింది. సంగీత మంటే ఏమిటో ఆ ద్వీపవాసుల కెవరికీ తెలియదు, కాని విద్వాంసు డనే మాట అందరికీ అర్థమయింది. రాజోద్యోగులు శర్వకుడికి అన్ని సౌకర్యాలూ అమర్చారు. ఆ రోజు సాయంకాలమే ఆస్థానానికి వచ్చి రాజుగారి ఎదట తన విద్యను ప్రదర్శించవలసిందిగా శర్వకుడికి ఉత్తరువు వచ్చింది.

"నాకు పక్క వాద్యాలు వాయించే వాళ్ళు కావాలి," అన్నాడు శర్వకుడు.

టి. భూషణరావు



రాజుగారి ఉత్తరువు తెచ్చిన వారికి పక్క వాద్యాలంటే ఏమిటో అర్థం కాలేదు.

శర్వకుడు తన వీణ తీసుకుని రాజ సభకు వెళ్ళాడు. అక్కడి వా రెన్నడూ సంగీతం విన్న పాపాన పోయినవారు కారు. వారిని తన సంగీతంతో మంత్రముగ్ధులను చేయాలని నిశ్చయించుకుని అతను వీణ వాయిస్తూ పాట ప్రారంభించాడు. త్వర లోనే సభికులు స్వరమాధుర్యానికీ, లయకూ సమ్మోహితులై తలలు ఆడిస్తూ, లయ ప్రకారం కాళ్ళూ, చేతులూ కదల్చుతూ తన్మయత్వం చెందారు. ఇక శర్వకుడు తన సంగీతంలో లీనమైపోయాడు.

ఒక్క రాజుగారు మాత్రమే గాన ప్రభావానికి వశుడు కాలేదు. ఆయన శర్వకుణ్ణి శ్రద్ధగా పరిశీలించి, అతని కేదో వ్యాధి పట్టుకున్నదనీ, అది అంతకంతకూ ముదురుతున్నదనీ ఒక నిశ్చయానికి వచ్చాడు.

ఆయన మంత్రి చెవిలో రహస్యంగా, "చూశారా, ఈ పండితుడు ఆ తీగలకొమ్మ పట్టుకుని అందులో నుంచి ఏదో లాగ యత్నిస్తున్నాడు. అది రాకుండా ఉంటున్నది. మానవుడు ఏదో విచిత్రమైన బాధతో అల్లాడి పోతున్నాడు! హైరానపడి పోతున్నాడు! మధ్య మధ్య హీనస్వరం పడి పోతున్నది. కుడిచేతి వేళ్ళు కొట్టుకుంటున్నాయి. ఎడమచేతి వేళ్ళు దేని కోసమో కొమ్మ అంతటా తడువుతున్నాయి. మీరు శీఘ్రంగా మన వైద్యుణ్ణి పిలిపించటం మంచిది. పాపం, ఎక్కడి నుంచో వచ్చి ఇక్కడ జబ్బుపడి పోయాడు. ఈ జబ్బేదో అంటువ్యాధి లాగుంది. సభలో అందరూ ఆడిపోతున్నారు; కాళ్ళూ, చేతులూ, తలలూ ఆడించేస్తున్నారు. వాళ్ళ స్థితి కూడా ఏమంత బాగాలేదు!" అన్నాడు.

మంత్రి వెంటనే రాజవైద్యుడికి కబురు చేశాడు. రాజవైద్యుడు శర్వకుణ్ణి క్షణం పాటు పరకాయించి చూసి, "ముందు

అతని చేతిలో ఉన్న ఆ వస్తువును తీసేయించండి. అదే వ్యాధి కారణంలాగా కనిపిస్తుంది," అన్నాడు.

రాజుగారి భటులు నలుగురు వచ్చి శర్వకుడి చేతిలోని వీణను అమాంతం లాగేసి దూరంగా పెట్టేశారు. శర్వకుడు పాట మాని నిర్ఘాంతపోయాడు. వైద్యుడు చెప్పినది నిజమే అయింది. కొంచెం వెర్రిచూపు పడిందన్న మాటేగాని సంగీత విద్వాంసుడు బాధపడటం మానేశాడు. సభికులందరూ కూడా మామూలు మనుషులయారు.

రాజవైద్యుడు శర్వకుణ్ణి అవతలికి తీసుకుపోయి, అతని నెత్తిన ఏదో తైలం మర్దన చేయించి, నిద్రపట్టటానికి ఔషధం తాగించాడు. వెంటనే శర్వకుడు నిద్రపోయాడు. వైద్యుడు అతని నాడి పరీక్షించి, "ఏమీ భయంలేదు. రేపీపాటికి మామూలు మనిషి అవుతాడు. కాని ఆ తీగలకొమ్మ ప్రమాదకరమైనది. దాన్ని సముద్రంలో పారేయించండి," అని రాజుతో చెప్పాడు.

శర్వకుడి వీణ కొరకు అంతటా వెతికారు, అది కనిపించలేదు. కాని శర్వకుడు పాడుతూ ఉండిన పాటే అంతఃపురంలో నుంచి విన వచ్చింది. రాజుగారు కంగారుపడి అంతఃపురానికి వెళ్ళి చూసే సరికి రాజకుమార్తె రమామణి వీణ వాయిస్తూ



పాడుతున్నది. ఆమె ఏక సంతగ్రాహి. చాలా సేపు శర్వకుణ్ణి గమనించి అతను వాయించే పద్ధతీ, పాడే పాటా పట్టుకున్నది.

"అమ్మాయీ, దాన్ని వెంటనే అవతల పారెయ్యి. దాని వల్ల వ్యాధి వస్తుందని వైద్యుడు చెప్పాడు," అన్నాడు రాజు.

"లేదు, నాన్నగారూ, మీరు పొరపడుతున్నారు. ఇదే సంగీతం. మీరు సంగీతాన్ని చెవులతో వినాలిగాని, కళ్ళతో మాత్రమే చూడరాదు. ఈ పండితుడి వద్ద నేను సంగీత విద్య అభ్యసిస్తాను. నాట్య విద్య కూడా తెలుసునేమో కనుక్కోండి," అన్నది రాజకుమార్తె.

ఆమె ఇలా అడగటానికి కారణమేమంటే, కొద్దికాలం కిందట ప్రవాళద్వీపపు యువరాజు కన్యాన్వేషణ చేస్తూ వచ్చి, రమామణిని చూసి తృప్తిపడి కూడా, ఆమెకు సంగీతమూ, నాట్యమూ రావని తెలిసి, అసంతృప్తి చెంది వెళ్ళిపోయాడు.

శర్వకుడు నిద్రలేచాక అడిగితే తనకు సంగీత నాట్య విద్యలు రెండూ వచ్చునన్నాడు. రాజుగారు జరిగిన పొరపాటుకు క్షమాపణ చెప్పుకుని, మంచి జీతం మీద అతన్ని తన కుమార్తెకు గురువుగా నియమించాడు. ఆరు మాసాలలో రమామణి, చురుకైన పిల్ల గనుక, సంగీత నృత్యాలు రెంటిలోనూ ప్రవీణురాలయింది. ప్రవాళద్వీపపు యువరాజును పిలిపించి అతని ఎదట రమామణి విద్వత్తు ప్రదర్శింపజేశారు. అతను పరమానందభరితుడై ఆమెను పెళ్ళాడతానన్నాడు. వారి పెళ్ళికి శర్వకుడు ఘనంగా గురుకట్నం పొందాడు.

ఆ తరువాత అతను స్వదేశానికి వెళ్ళిపోదామనుకున్నాడు. కాని మరాళరాజు వెళ్ళనివ్వక, అతన్ని తన ఆస్థాన విద్వాంసుడుగా పెట్టుకుని తన రాజ్యంలో కోరిన వారందరూ నృత్యగానాలు నేర్చుకునే సదుపాయం కలిగించాడు.






# మంచి-చెడు

ఒక గ్రామంలో ఇద్ద రన్నదమ్ము లుండే వాడు. పెద్దవాడు ధనికుడు, చిన్నవాడు పేదవాడు. ఒకసారి ఇద్దరూ కలుసుకున్న ప్పుడు, మాటల సందర్భంలో చిన్నవాడు తన అన్నతో, "జీవితం క్రూరమైనదే, అయినప్పటికీ చెడు చెయ్యటం కన్న మంచి చెయ్యటమే విధాయకం," అన్నాడు.

"చాల్చాల్లే! లోకంలో చెడు తప్ప మంచి ఎక్కడుంది? మంచి చేసిన వాడు మట్టి కొట్టుకుపోతాడు!" అన్నాడు అన్న.

"లేదన్నా! మంచి చేసే వాడికి ఫలితం ఉండి తీరుతుంది," అన్నాడు తమ్ముడు.

"సరే, అయితే, మనం పందెం వేసు కుని ఎదురైన వాళ్ళను ముగ్గురిని అడు గుదాం. వారు నువ్వన్నట్టే అంటే నా కున్న దంతా నీ కిచ్చేస్తాను; నే నన్నట్టు అన్నా రట్టాయెనా నీ కున్నదంతా నా కిచ్చెయ్యి," అన్నాడు అన్న.

"సరే, నీ యిష్టం!" అన్నాడు పేద వాడు. ఇద్దరూ వీధి వెంట బయలుదేరారు వారి కొక కూలి చేసుకునే వాడు ఎదురు పడ్డాడు. వాళ్ళు వాణ్ణి, "బతుకుతెరువుకు ఏది మంచిది—మంచి చెయ్యటమా, చెడు చెయ్యటమా?" అని అడిగారు.

"మీ రెంత పిచ్చివాళ్ళు! లోకంలో మంచి ఎక్కడున్నది? నన్ను చూడండి. రాత్రింబగళ్ళు ఒళ్ళు హూనం చేసుకు పని చేశాను. ఏ మిచ్చారు? తిండికి చాలదు. ఆ ఇచ్చే దానిలో మళ్ళీ కోతబెట్టాడు పని చేయించుకున్న పెద్దమనిషి! మంచిగా బత కటం కన్న చెడుగా బతకటమే మేలు," అంటూ వాడు వెళ్ళిపోయాడు.

అన్నదమ్ములు మరి కొంత దూరం వెళ్ళాక ఒక వర్తకుడు ఎదురయాడు. వాళ్ళు అతన్ని, మంచిగా బతకటం మేలా, చెడుగా బతకటం మేలా అని అడిగారు.

బి. లక్ష్మణాచారి



"ఏం ప్రశ్న వేశారూ! మంచి చేసి బతకగలమా? ఒక్క అమ్మకం చెయ్యాలంటే వంద అబద్ధాలాడాలాయె! లేకపోతే నీ సరుకమ్ముడు కాదే!" అంటూ వర్తకుడు ముందుకు సాగాడు.

"చూశావా? ఇద్దరూ నాతోనే ఏకీభవించారు!" అన్నాడు అన్న.

వారికి కొక జమీందారు ఎదురయాడు. ఆయనను కూడా వారు అదేవిధంగా ప్రశ్నించారు.

"మంచిగా బతకటమా! ఈ ప్రపంచంలోనా! ఇంకా నయం. నేనే ఉన్నాను. నేనే మంచిగా బతకటం మొదలు పెడితే— హుం!" అని మాట కూడా పూర్తి చెయ్యకుండా జమీందారు సాగిపోయాడు.

"తమ్ముడూ, విన్నావా? ఇక యింటికి తిరిగి పోదాం పద. పందెంలో ఓడిపోయావు గనక నీకున్నదంతా నా పరం చేసెయ్యి," అన్నాడు అన్న.

అతను తమ్ముడింట గల కొద్ది సామానూ తీసుకుపోతూ, "ప్రస్తుతానికి నీ పూరిపాకతో నాకు పనిలేదు గనక, నీ కింకో చోటు దొరికిన దాకా ఇందులో ఉండి, తరువాత నాకు స్వాధీనం చేసెయ్యి," అన్నాడు.

పేదవాడూ, భార్యా బిడ్డలూ పూరిపాకలో కూర్చున్నారు. వారికి తిండి లేదు. ఏదైనా అమ్ముదామన్నా ఇల్లు అయ్యవారి నట్టిల్లు లాగున్నది. కూలికి పోదామన్నా చుట్టుపక్కల ఎక్కడా పనులు లేవు.

ఆకలి బాధ దుస్సహమయేసరికి పేదవాడు ఒక సంచీ తీసుకుని అన్న ఇంటికి వెళ్ళి, "పిల్లలు ఆకలితో అల్లాడి పోతున్నారు. ఇంటో ఒక్క గింజ లేదు. సంచీడు బియ్యమో, నూకలో, ఏది ఇవ్వగలిగితే అది ఇయ్యి," అని అడిగాడు.

"బియ్యం ఎక్కడున్నవి, నూకలిస్తాను. కాని నీ కన్నొకటి పొడవనిస్తావా?" అని అన్న అన్నాడు.

"కావలిస్తే కన్ను పొడిచి అయినా నూక లియ్యి, నీ మేలు దేవుడు మరవడు," అన్నాడు తమ్ముడు.

అన్న తన పేద తమ్ముడికి సంచీడు నూక లిచ్చి, ఒక కన్ను పొడిచి పంపేశాడు.

పేదవాడు సంచీ తీసుకుని ఇంటికి రాగానే అతని భార్య అతన్ని చూసి బావురుమన్నది. అతను జరిగిన సంగతి భార్యకు చెప్పాడు. ఇద్దరూ కాస్సేపు ఏడిచి ఇంత గంజి కాచుకుని, పిల్లల కింత పోసి, తామింత తాగారు.

ఒక వారం గడిచింది. నూకలు అయిపోయాయి. మళ్ళీ ఆకలి పిశాచం వారిని పట్టుకున్నది. గత్యంతరం లేక పేదవాడు తిరిగి తన అన్న వద్దకే వెళ్ళాడు. రెండో కన్ను కూడా పొడిచి అన్న అతనికి మరొక సంచీడు నూక లిచ్చాడు. గుడ్డివాడైపోయిన తమ్ముడు ఎలాగో ఇల్లు చేరుకున్నాడు.

అతని భార్య చాలా ఆవేదన పడింది. "రెండు కళ్ళూ లేక ఎట్లా బతుకుతావు? ఇంకెవరి నడిగినా ఇన్ని నూకలు దొరికేవేనేమో—" అని ఆమె వాపోయింది.

"ఎందు కేడుస్తావే? ప్రపంచంలో ఎందరు గుడ్డివాళ్ళు లేరు? వారందరూ బతకటం లేదా?" అన్నాడు పేదవాడు.

రెండోసారి తెచ్చుకున్న నూకలు కూడా అయిపోయాక అతను తన భార్యతో, "ఇంక






మా అన్న దగ్గిరికి వెళ్ళటం వృథా. ఇంక పొడవటానికి నాకు కళ్ళు లేవు. నన్ను తీసుకుపోయి ఊరి బయట దారి పక్క పెద్ద రావి చెట్టు కింద కూచోబెట్టు. రోజల్లా అక్కడే కూర్చుంటాను. వచ్చే పోయ్యే వాళ్ళు తృణమో, పణమో వెయ్యక పోరు. సాయంకాలం చీకటి పడేవేళ వచ్చి నన్నిల్లు చేర్చుదువుగాని," అన్నాడు.

అతన్ని అతని భార్య పెద్ద రావిచెట్టు కింద కూర్చోబెట్టి వెళ్ళ పోయింది. దారే పొయ్యేవాళ్ళు అతనికి డబ్బులూ, ఇతర ఆహార పదార్థాలూ ఇచ్చారు. సాయంకాలమయింది. అతనికి ఇంటికి పోవాలని తొందర పుట్టింది, కాని భార్య ఇంకా రాలేదు. తనంతట తానే పోదామనుకుని ఆ గుడ్డివాడు కర్ర తాటించుకుంటూ బయలుదేరాడు.

అయితే అతను దారి తప్పాడు. ఎంత సేపు నడిచినా ఇల్లు రాదు. కొంతసేపటికి చెట్ల ఆకుల గలగల వినిపించి, తాను అడవికి చేరుకున్నానని గ్రహించాడు. అడవిలో రాత్రి వేళ క్రూరమృగాల భయం జాస్తి. అందుచేత అతను ఒక పెద్ద చెట్టు కోసం తడివి, ఎంతో కష్టం మీద దాని పైకి ఎక్కి కదలకుండా అక్కడ కూర్చుని, తెల్లవార్లూ అక్కడే ఉండటానికి నిశ్చయించుకున్నాడు.

అర్ధరాత్రి అయింది. కొన్ని పిశాచాలు ఆ చెట్టు కిందకు చేరాయి. పిశాచాల నాయకుడు, మిగిలిన పిశాచాలను, "మీరేమేం ఘన కార్యాలు చేశారు?" అని అడిగాడు.

ఒక పిశాచి, "నేను, రెండు సంచుల నూకల కోసం అన్నచేత తమ్ముడి కళ్ళు పొడిపించాను," అన్నది.

"బాగానే ఉంది. కాని దానికి విరుగుడున్నది. ఈ చెట్టు కింద పడిన మంచు బొట్లు తమ్ముడి కళ్ళకు రాస్తే అతని కళ్ళు మళ్ళీ వచ్చేస్తాయి," అన్నాడు నాయకుడు.

"ఈ మాట వాళ్ళకి తెలుసు గనకనా?" అన్నది పిశాచి.

ఇంకో పిశాచి, "నేను ఫలానా గ్రామంలో నీటి చుక్క లేకుండా చేశాను. వాళ్ళు నీళ్ళ కోసం ఆమడ దూరం పోవాలి. దారిలోనే చస్తారు!" అన్నది.

"బాగానే ఉంది. కాని దానికీ విరుగుడున్నది. ఆ గ్రామానికి దగ్గిరే ఉన్న బస్తీ వెలపల ఉండే కొండ రాయిని పక్కకు తోస్తే అంతులేని నీరు పొంగి వస్తుంది," అన్నాడు పిశాచాల నాయకుడు.

"ఈ సంగతి ఎవరికి తెలుసు గనకా?" అన్నది రెండో పిశాచి.

మూడో పిశాచి, "ఫలాని దేశపు రాజు కున్న ఒక్క కూతురికీ గుడ్డి తనం తెప్పించాను. వైద్యులు దాన్ని నయం చెయ్యలేక తన్నుకు చస్తున్నారు!" అన్నది.

"నీ మొహం! ఆ గుడ్డితనం కూడా ఈ చెట్టు కింద మంచు చుక్కలు రాస్తే పోతుంది. ఈసారి ఘన కార్యాలు చేస్తే ఇటువంటి లొసుగులు లేకుండా చూడండి. పదండి!" అన్నాడు పిశాచాల నాయకుడు.

ఈ సంభాషణ అంతా చెట్టు మీది నుంచి వింటున్న పేదవాడు, పిశాచాలు వెళ్ళిపోయినట్టు రూఢి చేసుకుని, ఉపాయంగా చెట్టు దిగి వచ్చి చెట్టు కింద ఉన్న మంచు చుక్కలు కళ్ళకు రాచుకున్నాడు. వెంటనే అతనికి ఎప్పటి దృష్టి తిరిగి వచ్చింది.





అతను తన వెంట ఉన్న చిప్పలో కొంత మంచు నీరు పోసుకుని, వట్టి పోయిన గ్రామానికి బయలుదేరాడు. దారిలో అతనికి ఒక ముసలిది నీళ్ళ కావడి మోసుకుపోతూ కనిపించింది.

"కాస్త తాగటానికి మంచి నీళ్ళిస్తావా, అవ్వా?" అని అత నామె నడిగాడు.

"ఈ నీళ్ళ కోసం నాలుగు కోసులు వెళ్ళి వస్తున్నా, నాయనా. దారిలోనే సగం చింది పోయాయి. మాది పెద్ద బలగం. ఇంటిల్లి పాతికీ ఇవే నీళ్ళు. అయినా, దాహ మన్న వాడికి ఎట్లా కాదనేది? తాగు," అంటూ ముసలిది అతనికి నీళ్ళిచ్చింది.

"విచారించ కవ్వా. నేను వచ్చేసరికి మీ ఊళ్ళో పుష్కలంగా నీరుంటుందిలే," అన్నాడు పేదవాడు.

ముసలిది ఉత్సాహంతో ఈ శుభవార్త తమ గ్రామస్తులకు చెప్పటానికి వెళ్ళి పోయింది. గ్రామస్తులందరూ అతనికి ఎదురు వచ్చి, "బాబూ, మాకు నీరిచ్చి పుణ్యం కట్టుకో!" అని వేడుకున్నారు.

"అందుకే వచ్చాను. ఈ గ్రామానికి దగ్గరగా ఒక బస్తీ ఉన్నదిట. నన్ను అక్కడికి తీసుకుపొండి," అన్నాడు పేద వాడు. బస్తీ వెలపలనే పెద్ద కొండ రాయి ఉన్నది. గ్రామస్తులంతా చేరి, ఎంతో శ్రమ పడి ఆ కొండ రాతిని పక్కకు పడదోశారు. వెంటనే పాతాళ గంగ పైకి వచ్చి వెల్లువగా ప్రవహించింది.

గ్రామస్తులు పేదవాణ్ణి దేవుణ్ణి కొలిచి నట్టు కొలిచి, అతనికి ఎంతో డబ్బూ, కాను కలూ ఇచ్చారు. అతను దూర ప్రయాణం మీద వెళ్ళుతున్నట్టు తెలిసి అతని కొక మంచి గుర్రాన్ని కూడా ఇచ్చారు.

అతను తిన్నగా గుడ్డి రాజకుమార్తె ఉన్న దేశం చేరి, ఆమె గుడ్డితనానికి చికిత్స చేస్తానని రాజుగారికి కబురు చేశాడు. మధ్య వాళ్ళు నిరుత్సాహ పరిచినా, ఇతని

సంగతి వినివున్న రాజుగారు ఇతని కోసం మనుషులను పంపాడు.

పేదవాడు రాజ కుమార్తె వద్దకు వెళ్ళి, తాను చిప్పలోకి తీసుకున్న మంచు బొట్లతో వేళ్ళు తడి చేసుకుని, రాజకుమార్తె కళ్ళు నిమురగానే ఆమెకు దృష్టి తిరిగి వచ్చింది. రాజు ఆనందానికి మేరలేదు. ఆయన అతనికి అంతులేని డబ్బూ, వస్తువాహనాలూ బహుమానంగా ఇచ్చాడు. వాటిని తీసుకుని అతను తన ఇల్లు చేరుకునే సరికి అతని భార్య పొందిన ఆశ్చర్యానందాలు అంతా ఇంతా కాదు. ఆమె ఆ సాయంకాలం తన భర్త కోసం వెళ్ళేసరికి అతను చెట్టు కింద లేడు. అసలే కళ్ళు లేనివాడు, ఎటు వెళ్ళాడో, ఏమయాడోనని ఆమె తల్లడిల్లి పోతున్నది. అలా వెళ్ళినవాడు కళ్ళతోనూ, అంతులేని సంపదతోనూ తిరిగి వచ్చాడు! అంతకన్న ఆశ్చర్యమూ, ఆనందమూ ఏముంటుంది?

ఈ వార్త ఊరంతటా పాక్కింది. అందరూ అతన్ని అభినందించటానికి వచ్చారు. అతను జరిగినదంతా దాచకుండా అందరికీ చెప్పాడు. అతని అన్నకు ఆశ పుట్టింది. ఆ రాత్రి అతను వెళ్ళి పిశాచాలు చేరే చెట్టెక్కి కూర్చున్నాడు. వాటి సంభాషణ విని తాను కూడా కుబేరుడు కావచ్చునని అతని ఆశ.

కాని ఆ రాత్రి పిశాచాలు మహా ఆగ్రహావేశంలో ఉన్నాయి.

"ఎవడో దుర్మార్గుడు మనం అనుకున్న మాట లన్నీ విని, మనం చేసిన ఘనకార్యాలకు విరుగుడు చేశాడు! వాణ్ణి పట్టండి, చీల్చండి!" అని పిశాచాలు అరుస్తూ చెట్టు చుట్టూ తాండవం చేశాయి. వాటికి చెట్టు మీద ఉన్న మనిషి కనిపించాడు.

"మా రహస్యాలు తెలుసుకుందా మని మళ్ళీ వచ్చావా?" అంటూ అవి అతన్ని చీల్చి చెండాడేశాయి.





# తెలివిగలవాళ్లు

ఉజ్బెకిస్థానంలో ఒక పేదవాడికి ముగ్గురు కొడుకు లుండేవాళ్ళు. తండ్రి వాళ్ళతో, "అబ్బాయిలూ, మనకు పశువుల మందలు లేవు, బంగారమూ లేదు. అందుచేత మీరు జ్ఞాన ధనం సంపాదించుకుని తెలివితేటలే ఆస్తిగా బతకవలిసి ఉంటుంది," అని బోధించాడు.

కొడుకులు తండ్రి చెప్పినట్టే జ్ఞానం సంపాదిస్తూ, ప్రతి విషయాన్ని సూక్ష్మ బుద్ధితో గ్రహిస్తూ పెరిగి పెద్దవా రయారు. కొంత కాలానికి వారి తండ్రి గతించాడు. ఇక వారు ఉన్న ఊరు వదిలి బతుకు తెరువు వెతుక్కుంటూ దేశాటన మీద బయలుదేరారు.

కొన్నాళ్ళపాటు నడిచిన మీదట వారి కొక నగరం అంత దూరాన కాన వచ్చింది. ఆ నగరంలో తమకు ఏదో ఒక పని దొరకక పోదనుకుంటూ వారు నగరం కేసి నడిచారు.

దారి కేసి చూస్తూ తల వంచుకుని నడుస్తున్న పెద్దవాడు చప్పున ఆగి, "కొద్ది సేపటి కింద ఇటుగా ఒక భారీ ఒంటె వెళ్ళింది," అన్నాడు.

ముగ్గురూ నగరం కేసి కొద్ది దూరం నడిచాక, రెండోవాడు, "దానికి ఒక కన్ను గుడ్డిది," అన్నాడు.

మరి కొంత దూరం వెళ్ళాక, మూడో వాడు, "దాని మీద ఒక ఆడదీ, ఒక బిడ్డా ఎక్కి ఉన్నారు," అన్నాడు. మిగిలిన ఇద్దరూ నిజమే నన్నారు.

వారు యింకా కొంత దూరం వెళ్ళినాక వారి వెనుక వైపు నుంచి ఒక మనిషి గుర్రం మీద వచ్చి వారిని కలుసుకున్నాడు. అతడు విలువైన కవచం ధరించి వున్నాడు.

పెద్దవాడు అతనితో, "అయ్యా, దేని కోసమో వెతుకుతున్నట్టున్నావు, ఒంటె కోసం కాదు గద?" అన్నాడు.

ఉజ్బెకిస్థాన్ జానపద కథ

"అవును, ఒంటె ఎటో పోయింది," అన్నాడు గుర్రమెక్కిన వాడు.

"పెద్ద ఒంటె—అవునా?" అని పెద్ద వాడు మళ్ళీ అడిగాడు.

"అవును. మీరు చూశారా దాన్ని?" అని గుర్రమెక్కిన వాడడిగాడు.

"దాని ఎడమ కన్ను గుడ్డిది—అవునా?" అన్నాడు రెండోవాడు.

"దాని మీద ఒక స్త్రీ, ఒక బిడ్డా ఎక్కి ఉన్నారు—కాదూ?" అని మూడోవాడడిగాడు.

"నిజం, నిజం! మీరు దాన్ని చూశారన్న మాట! అది ఏమయిందో చెప్పండి," అన్నాడు గుర్రమెక్కిన వాడు.

"మేము నీ ఒంటెను చూడనే లేదు," అన్నారు అన్నదమ్ములు.

ఒంటెను పోగొట్టుకున్న వాడికి వాళ్ళపైన గట్టి అనుమానం తగిలింది. "నా ఒంటెనూ, దాని మీద ఉన్న నా భార్యనూ, కొడుకునూ ఏం చేశారో చెప్పకపోతే మిమ్మల్ని పాదుషా దగ్గిరికి ఈడ్చుకుపోతాను," అన్నాడతను.

"మేము నీ ఒంటెను గాని, నీ భార్యను గాని, నీ కొడుకును గాని కళ్ళ చూడలేదు. కాని ఈ దిక్కుగా వెళ్ళితే నీకు ఒంటె దొరకవచ్చు," అన్నారు అన్నదమ్ములు.



వాళ్ళు తనను మభ్యపెట్టి తప్పించుకుపోజూస్తున్నారనుకుని గుర్రమెక్కిన వాడు, "మీరు కళ్ళ చూడని ఒంటెనూ, దాని మీద ఉన్న వారినీ ఎట్లా వర్ణించారు? పాదుషా దగ్గిరికి పదండి!" అంటూ వారిని పాదుషా దగ్గిరికి తీసుకుపోయి, వారు తన ఒంటెనూ, భార్యనూ, కొడుకునూ తస్కరించినట్టు ఫిర్యాదు చేశాడు.

"వాళ్ళు తస్కరించారనటానికి ఆధారమేమిటి?" అని పాదుషా అడిగాడు.

"నా ఒంటె పెద్దదనీ, దానికి ఒక కన్ను గుడ్డిదనీ, దాని మీద ఒక స్త్రీ, ఒక బిడ్డా ఉన్నారనీ వీళ్ళు చెప్పారు. ఆ తరువాత

తాము ఏమీ చూడనే లేదన్నారు. ఏమీ చూడని వాళ్ళు ఈ వివరాలన్నీ ఎలా చెప్పారు?" అన్నాడు ఒంటెను పోగొట్టు కున్న వాడు.

"ఆ ప్రశ్న కేం చెబుతారు?" అని పాదుషా అన్నదమ్ముల నడిగాడు.

"మేము మా కళ్ళను ఉపయోగించి ప్రతిదీ సూక్ష్మంగా పరిశీలించి అనేక విష యాలు తెలుసుకోగలం. అది మాకు చిన్న తనం నుంచీ అలవడిన విద్య," అన్నారు అన్నదమ్ములు.

"మీ విద్యను నే నిప్పుడే పరీక్షిస్తాను," అన్నాడు పాదుషా. ఆయన తన వజీరు చెవిలో ఏదో రహస్యంగా చెప్పాడు. వజీరు ఇద్దరు నౌకర్ల చేత ఒక పెట్టె మోయించి తెచ్చి, పాదుషా కెదురుగా పెట్టించాడు.

"ఆ పెట్టెలో ఏమున్నదో చెప్పండి?" అని పాదుషా అన్నదమ్ములను ఆజ్ఞా పించాడు.

"అది ఖాళీ పెట్టె. అందులో ఒక గుండ్రని వస్తువు మాత్రమే ఉన్నది," అని పెద్దవాడు అన్నాడు.

"ఆ గుండ్రని వస్తువు దానిమ్మకాయ," అన్నాడు రెండోవాడు.

"పండని దానిమ్మకాయ," అన్నాడు మూడోవాడు.



పాదుషా తన ఆసనం నుంచి దిగి వచ్చి పెట్టె మూత తెరిచి అందులో నుంచి ఒక పచ్చి దానిమ్మకాయ పైకి తీశాడు. సభలో వారంతా నిర్ఘాంతపోయారు.

"వీళ్ళు దొంగలు కారు! నిస్సందేహంగా మహామేధావులు! నీ ఒంటె ఏమైపోయిందో నీవే వెళ్ళి వెతుక్కో," అని పాదుషా ఫిర్యాదితో చెప్పి, అన్నదమ్ములను తనతోపాటు భోజనానికి తీసుకుపోయి, దివ్యమైన భోజనం పెట్టించి పానీయాలు తాగించాడు.

"మీ తెలివితేటలు నిజంగా అద్భుతంగా ఉన్నాయి. మీరు చూడని ఒంటెనూ, దాని మీద ఎక్కిన వారినీ ఎలా వర్ణించ గలిగారో నాకు తెలుసు కోవాలని ఉన్నది," అన్నాడు పాదుషా.

"దారిలో ఒంటె అడుగు జాడలున్నాయి. అవి మామూలు ఒంటెల గుర్తుల కన్న బాగా పెద్దవి. అందుకని అటుగా వెళ్ళినది భారీ అయిన ఒంటె అని తెలిసింది," అన్నాడు పెద్దవాడు.

"అది దారినపోతూ కుడి పక్కన వున్న గడ్డినే కొరికింది గాని ఎడమ పక్కన ఉన్న గడ్డిని ముట్టుకో లేదు. అందుచేత దాని ఎడమ కన్ను గుడ్డిదని తెలిసింది," అన్నాడు రెండోవాడు.



"ఒక చోట ఆ ఒంటె పడుకున్నది. అప్పుడు దాని మీది వాళ్ళు దిగారు. వారు దిగిన చోట ఇసుకలో స్త్రీ పాదాల గుర్తులూ, చిన్నబిడ్డ పాదాల గుర్తులూ కాన వచ్చాయి. అందుచేత ఒంటె పైన ఒక స్త్రీ, ఒక బిడ్డా ఉన్నట్టు తెలిసింది," అన్నాడు మూడోవాడు.

"మీరు చెప్పిన దంతా సబబుగానే ఉన్నది. మీ పరిశీలనా శక్తి గొప్పదే. కాని పెట్టెలో పచ్చి దానిమ్మకాయ ఉన్నదని ఎలా చెప్పగలిగారు? అది ఇంత తేలిక కాదే?" అన్నాడు పాదుషా.

"వినండి. మీ మనుషులు పెట్టె తీసుకు రావటాన్ని చూస్తేనే అది బరువు లేదని తేలి పోయింది. దాన్ని కింద పెట్టేటప్పుడు ఒక వైపు మొదట నేల నాని, రెండో పక్క కొంచెం వ్యవధిగా ఆనింది. అప్పుడు పెట్టెలో ఏదో వస్తువు దొర్లినట్టు శబ్దమయింది. దానినిబట్టి పెట్టె ఖాళీగా ఉన్నదనీ, అందులో ఉండే వస్తువు గుండ్రనిదైతే తప్ప ఆ విధంగా దొర్లదనీ గ్రహించాను," అన్నాడు పెద్దవాడు.

"ఆ పెట్టెను మీ దానిమ్మ తోట వైపు నుంచి తెచ్చారు. ఇంటిలో ఉండే పెట్టెను దానిమ్మ తోట కేసి తీసుకుపోయారంటే, అందులో దానిమ్మకాయ గాక మరే గుండ్రని వస్తువుంటుందీ?" అన్నాడు రెండోవాడు.

"అంతవరకు బాగానే ఉన్నది. అది పచ్చికాయ అని ఎలా తెలిసిందో నా కర్థం కావటం లేదు," అన్నాడు పాదుషా.

"అది కనుక్కోవటమే అన్నిటి కన్న తేలిక. దానిమ్మ పళ్ళు రావటాని కింకా తరుణం కాలేదు. కావలిస్తే తోటలోకి ఒక్క సారి తొంగి చూడండి అన్నీ కాయలే, ఒక్క కాయ కూడా ఇంకా పండ లేదు," అన్నాడు మూడోవాడు.

పాదుషా ఆ ముగ్గురన్నదమ్ముల తెలివికీ సంతోషించి వారిని మంచి జీతాల మీద తన కొలువులో పెట్టుకున్నాడు.






అక్షకుమారుణ్ణి హనుమంతుడు చంపాడని వినగానే రావణుడికి ఎంతో దుఃఖం కలిగింది. అతను దాన్ని అణచుకుని క్రోధావేశంతో ఇంద్రజిత్తును చూసి, "నాయనా, ఇంద్రుణ్ణి జయించిన వీరాగ్రేసరుడివి, బ్రహ్మ నుంచి దివ్యాస్త్రాలు పొందినవాడివి. ఈ కోతి కింకరుల నందరినీ చంపాడు, జంబుమాలినీ, మంత్రి కొడుకులనూ, అయిదుగురు సేనాపతులనూ, నీ తమ్ముడైన అక్షకుమారుణ్ణీ చంపాడు. వాడి బలం ఎలాటిదో సరిగా గ్రహించి వాడితో యుద్ధం చెయ్యి. వెళ్ళి, శత్రువును జయించి తిరిగి రా!" అన్నాడు.

ఇంద్రజిత్తు తండ్రికి ప్రదక్షిణం చేసి, ధనుర్బాణాలు తీసుకుని, రథ మెక్కి, యుద్ధోత్సాహంతో హనుమంతుడి కేసి వెళ్ళాడు. హనుమంతు డతన్ని దూరాన చూస్తూనే గట్టిగా సింహనాదం చేసి, తన శరీరాన్ని పెంచాడు. తరువాత ఇద్దరూ యుద్ధానికి తలపడ్డారు. ఇంద్రజిత్తు పదకొండువేల మంది ధనుర్ధారులతో ఒక్కసారిగా యుద్ధం చేయగల వాడు. కాని అతను తనపై వేసే బాణాలు తనకు తగలకుండా తప్పించుకుంటూ హనుమంతుడాకాశాన విహరించసాగాడు.

ఎంతసేపు యుద్ధం చేసినా హనుమంతుడు ఇంద్రజిత్తుకు గాని, ఇంద్రజిత్తు హనుమంతుడికి గాని అంతు చిక్కలేదు. తన బాణాలన్నీ వృథా అయిపోవటం చూసి ఇంద్రజిత్తు, "వీణ్ణి చంపటం అసాధ్యం.



ఏదోవిధంగా పట్టుకోవటం మంచిది," అనుకుని అందుకై బ్రహ్మాస్త్రం ప్రయోగించాడు. దానితో హనుమంతుడు కట్టుపడి, చెయ్యీ కాలూ కదలించలేని స్థితిలో ఉండిపోయాడు. అప్పు డతనికి, పూర్వం బ్రహ్మ తన కిచ్చిన వరం జ్ఞాపకం వచ్చింది. అతనికి ఏ అస్త్రం వల్లా ప్రమాదం లేకుండా బ్రహ్మ వర మిచ్చాడు. బ్రహ్మాస్త్రం చేత కట్టుపడినప్పటికీ, తనను బ్రహ్మ, దేవేంద్రుడూ, వాయుదేవుడూ కాపాడుతూనే ఉంటారని హనుమంతు డనుకున్నాడు. అతనికి రావణుడితో సంభాషించాలని కూడా కోరిక కలిగింది.



కదల కుండా పడి ఉన్న హనుమంతుణ్ణి రాక్షసులు సమీపించి, తాళ్ళతో అతన్ని బంధించారు. వారు హనుమంతుణ్ణి తాళ్ళతో కట్టగానే బ్రహ్మాస్త్రబంధం దానంతట అదే విడిపోయింది. ఈ సంగతి తెలిసిన ఇంద్రజిత్తు చాలా భయపడ్డాడు; ఎందుకంటే హనుమంతు డీ తాళ్ళను సులువుగా తెంచగలడు, బ్రహ్మాస్త్రం ప్రయోగించిన వాడి పైన మరే అస్త్రమూ పారదు. కనుక హనుమంతుడిప్పుడు తలుచుకుంటే లంకకు ఎంత చేటైనా చేయగలడు.

అయితే ఈ సంగతి హనుమంతుడికి తెలియలేదు. తాను తాళ్ళతో కట్టుపడగానే బ్రహ్మాస్త్రబంధం తొలగిందని కూడా అతనికి తెలియదు. ఈ లోపల రాక్షసులు హనుమంతుణ్ణి కసిగా ఈడ్చుతూ, కర్రలతోనూ పిడికిళ్ళతోనూ కొట్టుతూ, రావణుడుండే చోటికి లాక్కుపోయారు. ఇంద్రజిత్తు సభలోని రావణుడికి హనుమంతుణ్ణి చూపి, "వీడే ఆ వానరుడు," అన్నాడు.

సభలోని రాక్షసప్రముఖులు తమలో తాము, "ఎవడీ వానరుడు? ఇక్కడికెందుకు వచ్చాడు? ఎవరు పంపగా వచ్చాడు? ఎవరిని చూడ వచ్చాడు?" అని ప్రశ్నించుకున్నారు. మరికొందరు రాక్ష





సులు, "ఈ వానరుణ్ణి చంపి కాల్చండి, తినేద్దాం!" అన్నారు.

హనుమంతుడు ముందుకు వచ్చి, రావణుడి సింహాసనం దిగువన కూర్చుని ఉన్న వృద్ధమంత్రులనూ, మణులతో అలంకరించిన సభాభవనాన్నీ కలయజూశాడు. రాక్షసులు తాళ్ళు పట్టుకుని అటూ, ఇటూ గుంజుతున్న హనుమంతుణ్ణి రావణుడు చూశాడు. అతని కళ్ళు ఆగ్రహంతో చింత నిప్పుల్లాగా అయిపోయాయి. అతను తన మంత్రులను ఆజ్ఞాపిస్తూ, హనుమంతుణ్ణి చూపి, "వీడి విషయమేమిటో అడిగి కనుక్కోండి!" అన్నాడు.

హనుమంతుడు రావణుణ్ణీ, అతని మంత్రులైన దుర్ధరుణ్ణీ, ప్రహస్తుణ్ణీ, మహాపార్శ్వణ్ణీ, నికుంభుణ్ణీ, రావణుడి అత్యంత వైభవాన్నీ, తేజస్సునూ చూసి ఆశ్చర్యం పొందాడు. ఈ రావణుణ్ణి చూసి మూడు లోకాలూ గజగజ లాడటంలో వింత ఏమీ లేదని అతనికి అనిపించింది.

ఇంతలో రావణుడి ప్రేరణతో ప్రహస్తుడు హనుమంతుడితో ఇలా అన్నాడు:

"వానరుడా, భయపడకు. నిన్నెవరు పంపారు? దిక్పాలకులా? విష్ణువా? ఎవరు పంపినప్పటికీ నిన్నేమీ చెయ్యము. నిజం చెప్పు, నిన్ను విడిచిపెడతాము. నీవు చూడటానికి కోతిలాగా ఉన్నావేగాని, నీ ప్రభావం చాలా హెచ్చుగా కనబడుతున్నది. అబద్ధం చెప్పావో, నీ ప్రాణాలు దక్కవు. ఒకవేళ నీ అంతట నీవే వచ్చి ఉంటే, ఎందుకు వచ్చావో చెప్పు."

ప్రహస్తుడీ మాటలనగానే హనుమంతుడు రావణుడి కేసి తిరిగి, "నన్ను పంపినది ఇంద్రుడూ, కుబేరుడూ, వరుణుడూ, యముడూ కాదు; విష్ణువు కూడా కాదు. నేను పుట్టుకతోనే వానరుణ్ణి, నాపై తెచ్చిపెట్టుకున్న వానరరూపం కాదు. నిన్ను చూడటం సులభం కాదు గనక, అందుకై





అశోకవనాన్ని నాశనం చేశాను. అప్పుడు బలవంతులైన రాక్షసులు నా పైకి వచ్చారు. ఆత్మరక్షణ కోసం వారిని చంపాను. బ్రహ్మ వరం వల్ల నన్ను ఏ అస్త్రమూ ఏమీ చెయ్యి లేదు. కాని నిన్ను చూడాలనే కోరికతో బ్రహ్మాస్త్రానికి కట్టుపడ్డాను. నీతో ఒక రాచ కార్యం ఉండి వచ్చాను. నేను రాముడి దూతను. నీకు శుభకరమైన మాటలనే చెబుతాను, విను. ఈ మాటలను సుగ్రీవుడు నీతో చెప్పమన్నాడు : దశరథుడి కొడుకైన రాముడు, తన భార్య అయిన సీత తోనూ, తమ్ముడైన లక్ష్మణుడితోనూ తండ్రి ఆజ్ఞ పాలించి దండకారణ్యానికి వచ్చాడు. అక్కడ రాముడి భార్య అయిన సీత కన పడకుండాపోయింది. రాముడు సీతను వెతుకుతూ ఋశ్యమూకానికి వచ్చి సుగ్రీవుణ్ణి చేరుకున్నాడు. తరువాత ఆయన వాలిని చంపి, సుగ్రీవుణ్ణి వానర భల్లూకాలకు రాజుగా చేశాడు. అందుకు ప్రత్యుపకారంగా సుగ్రీవుడు సీతను వెతికిస్తానని మాట ఇచ్చాడు. ఆ మాట ప్రకారం ఆయన అన్ని దిక్కులకూ వానరులను పంపాడు. వారిలో ఒకడనైన నేను వాయుపుత్రుణ్ణి, హనుమంతు డనే వాణ్ణి. నేను నూరు యోజనాల సముద్రం దాటి సీతను చూడటానికి వచ్చాను. నీ అధీనంలో ఉన్న సీతను చూశాను. ఎంతో తపస్సు చేసి, ధర్మం తెలిసిన నీ వంటివాడు పరస్త్రీని చెరపట్టటం కూడని పని. రాముడికి అపచారం చేసి ఫల మనుభవించకపోవటం ఎవరికీ సాధ్యం కాదు. ఇక ముందు రాముడేం చేస్తాడో నాకు తెలియదు. సీతను రాముడి కిచ్చివేయటం నీకు శ్రేయస్కరం. అనేక జాతుల వల్ల నీకు మరణం రాకుండా వరం పొంది ఉన్నావు నిజమే, కాని సుగ్రీవుడు ఆ జాతులలో దేనికీ చెందని వానరుడు. నరుడైన రాముడి చేతిలోనో, వానరుడైన సుగ్రీవుడి చేతిలోనో నీకు చావు తప్పదు.



రాముడు ఒప్పడు గాని, నే నొక్కణ్ణే నీ లంకను నిర్మూలించ గలను. అసలు సీతను అపహరించి తెచ్చినప్పుడే మృత్యు దేవతను మెడకు చుట్టుకున్నావు. నేను రాయబారిని; అటు మానవుణ్ణీ కాను, ఇటు రాక్షసుణ్ణీ కాను. అందుచేత నీ మంచి కోరి చెబుతున్నాను. రాముడితో వైరం పెట్టుకుని నీవు జీవించలేవు," అన్నాడు.

ఈ మాటలు విని రావణుడు కోపోద్రేకంతో హనుమంతుణ్ణి చంపవలసిందిగా అజ్ఞ ఇచ్చాడు. అప్పుడు విభీషణుడు తన అన్నకు అడ్డు తగిలి ఇలా అన్నాడు: "ఈ దూతను చంపటం రాజ ధర్మం కాదు. ఆగ్రహావేశంలో ధర్మహాని చెయ్యటం తగదు. ఇతను కేవలమూ దూత మాత్రమే కాదు, అక్షుడు మొదలైన వారిని చంపాడు కనుక శత్రువే. అయినను దూతగా వచ్చిన వాడికి విధించే శిక్షలున్నాయి. ఇతనికి అంగ వైకల్యం కలిగించవచ్చు, కొరడాతో కొట్టవచ్చు, శిరస్సు ముండనం చేయవచ్చు, కాల్చి ముద్ర వేయవచ్చు—కాని చంపరాదు. శాస్త్రం మాట అటుంచి, ఇతన్ని చంపటం చేత మన కేమీ లాభం లేదు. ఇతన్ని ఎవరు పంపారో వారిని చంపు."

ఈ మాట రావణుడికి నచ్చింది. "నిజమే, దూత అయిన వీణ్ణి చంపవద్దు, మరేదైనా శిక్ష విధింతాము. కోతులకు ఇష్టమైనది తోక. ఇతడి తోకను కాల్చి పంపెయ్యండి. తోక అంటించి వీణ్ణి వీధులన్నీ తిప్పండి," అన్నాడు.

రాక్షసులు హనుమంతుడి తోకకు గుడ్డ పీలికలు చుట్టి, చమురుపోసి అంటించి, నాలుగు వీధులూ తిప్పుతూ, "వేగులవాణ్ణి చూడండి," అని కేకలు పెట్టారు. హనుమంతు డిది లక్ష్యపెట్టక, పట్టపగలు నగర రక్షణ సాధనలు ఎట్లా ఉన్నదీ చూడవచ్చునని ఆశపడ్డాడు. అతన్ని చూడటానికి రాక్షస స్త్రీలూ, పిల్లలూ ఎగ బడ్డారు.

కొందరు రాక్షసస్త్రీలు సీత వద్దకు వెళ్ళి, "నీతో మాట్లాడి వెళ్ళాడే, ఆ వానరుడి తోకకు నిప్పు అంటించి, నగరమంతా తిప్పుతున్నారు," అని చెప్పారు.

సీత ఆ మాటలు విని చాలా బాధపడి, "నేనే పతివ్రతనైతే హనుమంతుడికి చల్లగా ఉండు," అని అగ్నిహోత్రుణ్ణి ప్రార్థించింది.

సీత ఈ మాట అనగానే హనుమంతుడి తోకలోని జ్వాలలు మరింత పెద్దవయాయి. కాని హనుమంతుడికి మంట తోచలేదు. అది చూసి హనుమంతుడికి ఆశ్చర్యమయింది. అతను చేయవలసిన దాన్ని గురించి ఆలోచించాడు. మొట్టమొదటగా మిక్కిలి చిన్నవాడై కట్ల నుంచి విడిపించుకున్నాడు. మరుక్షణమే తన దేహాన్ని పెంచి, నగరద్వారం వద్ద ఉన్న పరిఘను తీసుకుని, తన వెంట ఉన్న రాక్షసుల నందరినీ చావమోదాడు. అతను లంకా నగరం కేసి చూస్తూ, "ఇప్పుడేం చేస్తే బాగుంటుంది?" అనుకున్నాడు. అప్పటికే రాక్షసులకు చేయవలసిన నష్టం చాలా చేశాడు, లంకా దుర్గాన్ని నాశనం చెయ్యటమే మిగిలి ఉన్నది. లంకలోని మహాభవనాలను అగ్నిహోత్రుడికి ఆహుతి ఇవ్వటమే కర్తవ్యం.



ఈ మాట అనుకుని హనుమంతుడు మండుతున్న తోకతో లంకలోని భవనాల మీదుగా సంచరించ నారంభించాడు. నిర్భయంగా రాక్షసుల యిళ్ళన్నీ తిరిగాడు. ప్రహస్తుడి భవనానికి నిప్పు అంటించి, మహాపార్శ్వుడి ఇంటి పైకి దూకాడు. ఆ ఇంటిని దేదీప్యమానంగా అంటించి, తరవాత వరుసగా వజ్రదంష్ట్ర, శుక, సారణుల గృహాలకు నిప్పు పెట్టేశాడు. తరువాత ఇంద్రజిత్తూ, జంబుమాలి, సుమాలిల ఇళ్ళన్నీ అంటించాడు. అతను ఒక్క విభీషణుడి ఇల్లు తప్ప మిగిలిన రాక్షసోత్తముల ఇళ్ళను, మణులతో సహా తగలబెట్టేశాడు.

లంక కంతా చిచ్చుపెట్టే హనుమంతుడికి సహాయంగా వాయుదేవుడు వీచాడు. వాయువు సహాయంతో లంక అంతా వేగంగా అంటుకున్నది. ఒక్కొక్క మేడే కూలి పడసాగింది.

మండిపోతున్న తమ ఇళ్ళను రక్షించుకోవటం రాక్షసులకు సాధ్యంకాలేదు. మగవాళ్ళూ, పిల్లలూ, స్త్రీలూ భీభత్సంలో మునిగిపోయారు. ఎంతోమంది మంటలలో నశించారు. తగలబడిపోతున్న లంక భయంకరంగా కనబడింది. రాక్షసుల ఆర్తనాదాలు ఈ దృశ్యాన్ని మరింత భయానకం చేశాయి.

హనుమంతుడు ఒక్కసారి లంక అంతా కలయజూచి, ఆ నగరంలోని అన్ని ప్రాంతాలూ తగలబడిపోతూ ఉండటం గమనించి, తన తోకలోని మంటలను సముద్రంలో ముంచి ఆర్పేశాడు.

ఆ సమయంలో అతనికి పెద్ద భయం పట్టుకున్నది : లంకతో బాటు సీత కూడా తగలబడిపోయి ఉంటుంది! ఈ ఆలోచన రాగానే హనుమంతుడు తనను తాను తిట్టుకున్నాడు ; ఆగ్రహం చెందిన వాడికి కార్యాకార్య విచక్షణ లేకుండా పోతుందనుకున్నాడు : తాను వచ్చిన పని అంతా మంట కలిసి పోయిందనుకున్నాడు.

కాని అంతలోనే అతనికి మళ్ళీ ధైర్యం వచ్చింది. తాను వచ్చిన పని ఇన్ని విధాల సఫలమైన తరువాత సీత చావటం జరగదు. తన తోకనే కాల్చని అగ్నిహోత్రుడు సీతను దహిస్తాడా ? అలా ఎన్నటికీ జరగదు. సీతే అగ్నిలాటిది ! ఆమెను అగ్ని ఏం చెయ్యగలడు ? అత నలా అనుకుంటూండగానే ఆకాశాన చారణులు అనుకునే మాటలు వినిపించాయి. లంక అంతా దగ్గమైనా సీతకు ఏ అపాయమూ కలగకపోవడం గురించి వారు ఆశ్చర్యంగా చెప్పుకునే మాటలు విని హనుమంతుడు పరమానందం చెందాడు.






# తండ్రి ఆస్తి

పాపన్న భార్య గర్భవతిగా ఉంది. ఆమెను పురిటికి పుట్టింటి దగ్గిర దిగబెట్టి పాపన్న తన గ్రామానికి వెళుతూండగా అతనికి ఒక పూరి గుడిసెలో నుంచి, "ఓరి భగవంతుడా! నాకు దిక్కులేని చావు రాసి పెట్టావా?" అని ఎవరో ఆక్రోశించటం వినిపించింది. పాపన్న వెంటనే ఆ గుడిసెలోకి ప్రవేశించి చూశాడు. ఒక పండు ముసలి, కుక్కి మంచంలో పడుకుని ఆరాటపడుతున్నాడు.

"బాబుగారూ, ఏమిటి మీకు వచ్చిన బాధ?" అని పాపన్న ఆ వృద్ధు నడిగాడు.

"ఎవరవో, నాయనా! దేవుడల్లే వచ్చావు. నా కాలం తీరిపోయింది. కన్ను మూసేలోగా నా కొడుకును ఒక్కసారి చూడాలనుంది," అన్నాడు వృద్ధుడు.

"మీ కొడుకు కాకపోతే నేనున్నాను. ఏం కావాలో చెప్పండి. మీకు అసలు జబ్బేమిటి?" అని పాపన్న అడిగాడు.

"వయస్సు తప్ప నాకు వేరే జబ్బేమీ లేదు. ఆకలిగా ఉన్నది, దాహమవుతున్నది. కాసిని నీళ్ళివ్వు. చచ్చిపోతున్నానని విచారమేమీ లేదు గాని, నా కొడుకును ఒక్కసారి చూడాలి. అది ముఖ్యం," అన్నాడు వృద్ధుడు ఆయాసపడుతూ.

పాపన్న గుడిసె అంతా కలయ చూశాడు. ఎక్కడా చుక్కనీరు లేదు, తినటానికి మొదలే లేదు. అతను చప్పున గ్రామంలోకి వెళ్ళి, నాలుగిళ్ళలోనూ అడిగి వృద్ధుడికింత భోజనమూ, కుండతో నీరూ తెచ్చాడు. ఆ తిండి తిని, నీరు తాగి వృద్ధుడు కొంచెం తేరుకున్నాడు.

"నాయనా, ఈ జన్మలో కాకపోతేనేం, ఏ జన్మలోనో నాకు కొడుకువే అయి ఉంటావు. నా కొడుకును కూడా తీసుకు వచ్చావా, నీకు జన్మజన్మలకూ ఋణపడి ఉంటాను. నా కొడుకు ఫలానా గ్రామంలో

పరోపకారి పాపన్న కథ



ఉన్నాడు. వాడి పేరు గౌతముడు. నేనీ గ్రామంలో ఉన్నాననీ, ఇంకో వారం, పది రోజుల కంటె బతకననీ, చచ్చేలోగా వాణ్ణి ఒక్కసారి తప్పకుండా చూడాలని కోరుతున్నాననీ చెప్పి ఎలాగైనా తీసుకు రావాలి!" అన్నాడు వృద్ధుడు.

పాపన్న ఆ వృద్ధుడికి రెండు రోజుల పాటు సరిపోయే తిండీ, నీరూ ఏర్పాటు చేసి, ఆయన చెప్పిన గ్రామానికి వెళ్ళాడు. అక్కడ అతనికి గౌతముడు దొరికాడు.

"మీ తండ్రిగారు ఫలానా గ్రామంలో అవసానదశలో ఉన్నారు. చూసే దిక్కు లేదు. బిచ్చ మెత్తుకుని జీవిస్తున్నారు. ఇప్పుడు మంచాన పడి, మిమ్మల్ని చూడాలంటున్నారు. మీరు వచ్చి ఆయనను ఈ నాలుగు రోజులూ కనిపెట్టి ఉండి మీ కర్తవ్యం మీరు నెరవేర్చండి," అని పాపన్న గౌతముడికి చెప్పాడు.

గౌతము డీ మాటలు విని చీదరించుకుని, "ఛీ, ఛీ! ఆ బిచ్చగా డెవడో నా తండ్రి అంటా వేమిటి? నా తండ్రి ఏనాడో పోయి ఉంటాడు. ఆయన కనిపించకుండా పోయి ముప్పై ఏళ్ళయింది," అన్నాడు.

కాని పాపన్న అతన్ని వదలక రావలిసిందని నిర్బంధించాడు. నలుగురూ కూడారు. వారిలో ఒక పెద్దమనిషి, "వెళ్ళి చూసి రాగూడదుటయ్యా? ఒకవేళ మీ తండ్రి ఇంతకాలమూ బతికే ఉన్నాడేమో. ఈ పెద్ద మనిషి ఈ వార్త చెప్పటానికి నిన్ను వెతుక్కుంటూ వస్తే మొండితనం చేస్తావేమిటి?" అని గౌతముణ్ణి మందలించాడు.

గౌతముడు అయిష్టంగా పాపన్న వెంట బయలుదేరి వృద్ధుడున్న చోటికి వచ్చాడు. కుక్కిమంచంలో పడి ఉన్న ఆ ముసలి తొక్కనూ, ఆ పూరి గుడిసెనూ చూసి గౌతముడు చాలా అవమానం చెంది, "ఈ ముసలివాడా నా తండ్రి? నన్ను నలుగురిలో అవమానం చెయ్యటానికేనా,

రాను మొర్రో అంటుంటే వెంట లాక్కొచ్చావు ?" అని వెనక్కు తిరిగాడు.

"ఒరే, నాయనా, గౌతమా! నేనేరా నీ తండ్రినీ! రారా! ఒక్కమాట చెప్పాలిరా!" అని వృద్ధుడు కేకలు పెట్టాడు. కాని గౌతముడు వినిపించుకోకుండా వెళ్ళిపోయాడు. కేకలుపెట్టిన ఆయాసంలో లేచిన ముసలివాడు కాస్తా మళ్ళీ వెనక్కు పడిపోయాడు. పాపన్న ఆయనకు ఉపచారాలు చేస్తూ ఆ గుడిసెలోనే ఉండిపోయాడు. ఆ సమయంలో వృద్ధుడు పాపన్నకు తన కథ అంతా చెప్పాడు :



"ఇప్పుడు నా కొడుకున్న గ్రామంలోనే నేను ఒకప్పుడు గౌరవంగా బతికిన వాణ్ణి. గౌతముడు నా కొక్కడే కొడుకు. అందుచేత వాణ్ణి ఎంతో గారాబంగా పెంచి పెద్ద చేసి, పెళ్ళి చేశాను. భార్య కాపరానికి రాగానే వాళ్ళకు నేనంటే కంటక మయింది. ఇద్దరూ కలిసి నన్ను అనరాని మాటలని, బయటికి తరిమేశారు. నేను దూరదేశం వెళ్ళి ఒక జమీందారుగారి దగ్గిర కొలువుకు కుదిరి పని చేస్తూ, పొట్ట పోసుకుంటూ చాలా ఏళ్ళు గడిపాను. తరువాత జమీందారుగారు చని పోతూ నాకు ఒక బిందెలో వెయ్యి బంగారు కాసులు పోసి ఇచ్చారు. దానితో నేనీ వూరు వచ్చి, ఈ ఇంటి పెరడులో ఆ బిందెను పాతిపెట్టి, భిక్షాటనతో పొట్ట పోసుకుంటూ వచ్చాను. జరిగిన దానికి నా కొడుకు పశ్చాత్తాపపడి నన్ను ఆదరిస్తాడనీ, అప్పుడు వాడి కా బంగారు కాసులు ఇచ్చేద్దా మనీ కలలు గన్నాను. వాడు నన్ను ఒక్కసారి నోరారా, నాన్నా, అని పిలిచి ఉంటే ఆ బంగారమంతా వాడి కిచ్చి ఉందును. కాని వాడి కది ప్రాప్తం లేదు. ఈ జన్మకు కూడా నీవే నా కొడుకువు. అందుచేత ఆ బిందె నీవే తీసుకో. నేను కళ్ళు మూయగానే ఆ బంగారంలో కొంత నాకు ఉత్తర క్రియలకు ఖర్చుపెట్టి, మిగిలినది నీవే ఉంచుకో!"

ఆయన చెప్పిన గుర్తులను బట్టి పాపన్న పెరట్లో తవ్వించి బిందె పైకి తీయించాడు. తరువాత రెండు రోజులకు వృద్ధుడు కన్ను మూశాడు. పాపన్న ఆయనకు శాస్త్రోక్తంగా ఉత్తర క్రియలు జరిపించాడు.

ఈలోపుగా ఈ బంగారం వార్త అన్ని గ్రామాలకూ కార్చిచ్చులా వ్యాపించింది. ఎవరో బిచ్చగాడు వెయ్యి బంగారు కాసులు దాచి ఉంచి, దారే పొయ్యేవాడి కిచ్చేశాడన్న వార్త గౌతముడి దాకా వెళ్ళింది. అతను భార్యతో సహా బయలుదేరి వచ్చేసరికి పాపన్న పదవరోజు సమారాధన చేస్తున్నాడు. చుట్టుపక్కల గ్రామాల నుంచి ఎందరో బ్రాహ్మణులు వచ్చి భోజనాలు చేశారు. ఒక్కొక్కరికీ ఒక్కొక్క బంగారు కాసు తాంబూలంలో పెట్టి ఇస్తున్నాడు పాపన్న.

పాపన్న గౌతముణ్ణీ, అతని భార్యనూ చూసి, "మీ రిప్పుడు వచ్చారా? ముందు భోజనం చెయ్యండి," అన్నాడు. భోజనం పెట్టించి వారికి తాంబూలాలు ఇచ్చాడు.

గౌతముడు పాపన్నతో, "నేను ఇక్కడ నుండి వెళ్ళి పోయిన తరువాత ఆ ముసలి వాడు నా తండ్రే నని రూఢిగా తెలిసింది. ఆయన బంగారు కాసుల బిందె ఏదో దాచా డట. ఏదీ? కొడుకును గనక అది నాకు చెందవలిసి ఉంటుంది," అన్నాడు.

"మీ కిద్దరికీ తాంబూలాలలో బంగారు కాసు లున్నాయేమో చూసుకోండి. ఇదుగో ఆ బిందె!" అంటూ పాపన్న ఖాళీ బిందె తెచ్చి గౌతముడి ఎదట పెట్టాడు.

పాపన్న చేయించిన సమారాధన గురించి, భోజనాలు చేసిన వారందరికీ తాంబూలా లతో ఒక్కొక్క బంగారు కాసు దక్షిణ ఇవ్వటం గురించీ పదిమందీ ఘనంగా చెప్పుకుంటున్న మాటలు విని తన తండ్రి దాచి ఉంచిన బంగారు కాసు లన్నీ ఏమయాయో, బిందె ఎందుకు ఖాళీ అయిందో గౌతము డర్థం చేసుకున్నాడు.



# 29. యూటా రాష్ట్రంలోని రాతి ఆర్చీలు

యూటా రాష్ట్రం (అమెరికా)లోని ఈ రాతి ఆర్చీలు అతి విచిత్రమైనవి. 4 కోట్ల సంవత్సరాలనాటి ఇసుకరాతి గోడలలో గాలి రంధ్రాలు చేయగా ఇవి ఏర్పడ్డాయి. వీటిలో కొన్ని 300 అడుగుల ఎత్తూ, అనేక వందల గజాల నిడివీ ఉన్నాయి. కొన్ని ఆర్చీలు గాలికి "అరిగి" శిథిలమైపోయాయి. మాన్యుమెంట్ లోయలో ఇలాటి ఆర్చీలు 83 ఉన్నాయి. (చిత్రంలో చూపినది ఒక జంట ఆర్చి.)



Photo by Prabhakar Mahadki



బహుమతి
పొందిన వ్యాఖ్య

కార్యసాధన

పంపినవారు :
జి. ఎస్. జనార్ధన్, రంగేపల్లి

Photo by P. R. Shinde



బహుమతి
పొందిన వ్యాఖ్య

కళారాధన

పంపినవారు:
జి. ఎస్. జనార్ధన్, రంగేపల్లి

## ఫొటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

ఈ ఫొటోల వ్యాఖ్యలు 1964 జూన్ నెల సంచికలో ప్రకటింపబడును.





★ పై ఫొటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలో గానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ ఏప్రిల్ నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫొటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

## ఏప్రిల్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫొటో : కార్యసాధన

రెండవ ఫొటో : కళారాధన

పంపినవారు : జి. ఎన్. జనార్థన్,

రంగేపల్లి (చెంగల్‌పట్ జిల్లా)

బహుమతి మొత్తం రు. 10/— ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. NAGI REDDI at the B. N. K. Press Private Ltd., and Published by B. VENUGOPAL REDDI for Sarada Binding Works, 2 & 3 Arcot Road, Madras-26. Controlling Editor : 'CHAKRAPANI'




మీరూ అంగీకరిస్తారు

# టాటా-ఫిన్లే

# టీ

సాటిలేని టీ!

## తాజా టీ

తాజాగా వుంచుటకు టాటా-ఫిన్లే టీని ప్రత్యేకమైన ప్యాకింగ్‌లో సురక్షితముగా భద్రపరచుతారు.

## పరిమళమైన టీ

అతి సున్నితమైన పరిమళమిచ్చుటకు కావలసిన కోమలమైన ఆకులను మొగ్గలనే టాటా-ఫిన్లే టీలో ఉపయోగిస్తారు.

## ఉత్తమ టీ

టాటా-ఫిన్లే టీ మిశ్రణ (బ్లెండింగ్) అతి నిపుణతతో చేస్తారు. కనుకనే ఈ టీ చిక్కగా రుచికరంగా వుంటుంది.

**టాటా-ఫిన్లే టీ త్రాగండి;**
**ఆనందము అందుకోండి!**



ఈ క్రింది రకాలలోను, ప్యాకింగ్స్‌లోను టాటా-ఫిన్లే టీ దొరుకుతుంది:-
ప్రెస్టిజ్ డార్జిలింగ్-సుందరమైన టిన్
లలిత్-బంగారు రంగు ప్యాకెట్
మిలాప్-వెండి రంగు ప్యాకెట్
షాన్-నీలి రంగు ప్యాకెట్




-TFN-5-TEL

రుచికరమైన ఆహారమునకు

# తుషార్ వనస్పతి

ఎ, డి విటమినులతో బలపరచబడినది







ASP/TV/12 TEL

